# మట్టీ మనిషీ ఆకాశం

డా॥ సి. నారాయణరెడ్డి

మనస్వినీ ప్రచురణలు
హైదరాబాదు
1998

MATTĪ MANISHĪ ĀKĀSAM
By
Dr. C. Narayana Reddy

First Published, July, 1997
Second edition, August, 1998

**Price Rs. 50/-**



Cover Design
**Seela VeerÉaju**

For Copies :
**Visalandhra publishing House**
4-1-435, bank Street
vignan Bhavan Hyderabad - 500 001
and its Branches

and

**Manaswini Prachuranlu**
Pot No-48
Filmnagar Colony
Jubilee Hills,
Hyderabad - 34.

Composed at
**Fontline Graphics,**
Hyderabad. Ph. 7660000

Printed at
**Vimla printers**
Hyderabad. Phone : 7636242

మట్టిని స్థలానికీ ఆకాశాన్ని కాలానికీ ప్రతీకలుగా గ్రహించి మనిషిని ఈ రెంటికి అనుసంధానకర్తగా రూపొందించి రచించిన కావ్యమిది. భూమి తన అస్తిత్వాన్ని చూసుకొని అహంకరిస్తుంది. ఆకాశం ఆ అహంకారాన్ని అణచివేస్తుంది. ఆకాశం సముద్రాన్నిచూసి అసూయపడుతుంది. మనిషికూడా అంతే! పంచేంద్రియాల మాయాజాలానికి లోనై తన చిరునామాను పోగొట్టుకుంటాడు. భ్రాంతికీ వాస్తవికతకూ మధ్య కొట్టుమిట్టాడుతాడు. కాని అంతలోనే తేరుకొని హేతువును జీవధాతువుగా చేసుకొని పురోగమిస్తాడు. ఆశ శ్వాసగా పరిణామశీలిగా పరిక్రమిస్తాడు. ఇలాంటి మనిషికి మరణం లేదు. అది ఉందీ అంటే శరీరానికే, ఆలోచనలకు కాదు. నిత్యచైతన్యవంతుడైన మనిషి స్థలాన్నీ కాలాన్నీ జయిస్తాడు. ఇదీ ఈ కావ్యంలోని ఇతివృత్తం.

మట్టీ మనిషీ ఆకాశం
వీటి చుట్టే అల్లుకుంది సృష్టికథా సూత్రం.
మట్టి ప్రసవించిన  చెట్లు మనిషి చేతుల్లా లేచి
నింగిని తట్టి లేపుతాయి.
ఉలికిపడ్డ పగటికన్ను తెరుచుకుంటుంది.
తూర్పుగట్టునుంచి దూకిన సూర్యుడు
పడమటి గట్టునుంచి బయటికి జారుకుంటాడు.
రాత్రికన్ను తననుతానే నులుముకుంటుంది.
నక్షత్రాల జిలుగులు పుప్పొళ్లలా రాలుతాయి.
మొండికేసి కూచున్న కొండను
పాదాల గునపాలు తొలుచుకు పోతాయి.
రెండు వైపులా ఉన్న భూభాగాలను
కలిపేస్తుంది కాలిబాట
తప్పిపోయిన కవల పిల్లలను ఒకే ఉయ్యాలలో చేర్చినట్టు.
ఎడారిలో మెడలుసాచి నిలిచిన మేడలకు
నాట్లు వేసింది చెమట చుక్కలే.
ఎత్తైన కట్టడాలకు కళ్లు నెత్తిమీద కదా
పునాదుల వైపు చూడవు.
ఆదృష్టి గ్రహాలపైనే

వాటిలో ఎప్పుడు మకాం వేద్దామా అని.
తుఫాను అలికిడి చెవిలో జోరీగలా వినిపిస్తుంది.
నేల తనపక్క సర్దుకునే సరికి
చావుకంపు కొడుతుంది.
భూగోళం మొనమీద ఖగోళాన్ని తిప్పే
మనిషి మేధకు కంపరం పుడుతుంది.
తన అరిచేతిలో ఉన్న ఆటబంతి
పిడుగై పేలుతుంది.
తానెక్కిన నిచ్చెనే తనను తోసేస్తుంది.
నిచ్చెన కాళ్లు పట్టుకుని ప్రాధేయపడడు మనిషి.
చంద్రబింబం నుంచి తాను తవ్వి తెచ్చిన రాతి బెడ్డలు
ఇప్పటికీ అద్దాల గంపలో ఉన్నాయి.
అవి గుర్తుకొచ్చినప్పుడల్లా
అహం కొమ్ములకు పదును పుడుతుంది.
మట్టిలోకి చొచ్చుకుపోయిన మనిషి వేళ్లు
వృక్షమూలాల్లా నిశ్చలంగా నిలుస్తాయి.
శిరసు వ్యోమశిఖరం మీద నిలుస్తుంది.
ఏమో! ఎప్పటికైనా ఆకాశాన్ని మడిచితెచ్చి
భూమి ఒంటికి చుట్టకపోతాడా
నిరంతరాన్వేషి మనిషి.
అన్వేషణకు మూలం పరిణామశీలం

పరిణామమంటే పదార్థాల నరాల్లో ఉరికే
కరెంటు మాత్రమే కాదు.
కాలం చొరబడని అగమ్య స్థావరాల్లో
ఆలోచనలసేనల్ని నడిపించే టార్చ్‌లైట్.
నడకను ముందుకు విసిరేస్తూ సాగే పాదాలు
అప్పుడప్పుడు మతిభ్రమించి ఆగిపోతాయి.
చిక్కగా పరుచుకున్న చెట్లనీడల బుగ్గలు నిమురుతూ
సుఖశయ్యలకు అంటుకుపోతాయి.
ప్రలోభాలుండేవి ఆకట్టుకోవడానికే
ఎదిగే ఆయువుపట్లను చుట్టుకోవడానికే.
ఎప్పటికప్పుడే ఎక్కడికక్కడే
ఇంద్రియాలను తీయతీయగా పీల్చేసే
మనోరోచక రుచులు ఎదురవుతుంటాయి.
చీకటి దుమారమొచ్చి కళ్లను బాదేసరికి
అడుగులు ఉలికిపడిలేస్తాయి
పోగొట్టుకున్న నడకకోసం ఆక్రోశిస్తాయి.
కదిలిపోవడమంటే కాలాన్ని కత్తిరిస్తూ పోవడమే.
కత్తిరించిన చేతులు కనుమరుగయ్యేలోగా
ఎప్పటిలా కాలం అతుక్కుపోతుంది
పడవ చీల్చుకుపోయిన నీళ్లలా.
పగటి నుదుటికీ రాత్రినాభికీ అగుపించని లంకెవుంది.

అక్కడ మెరిసిన వెలుగుముద్ద ఇక్కడ అదృశ్యమవుతుంది.
నాభిమూలంలో అస్తమించిన అరుణబింబం
నవనాడుల్లో పారుతుంది నాదధారలా.
కాంతి నాదమైనప్పుడు
నాదం స్తబ్ధచేతనను విద్యుదీకరించినప్పుడు
శరీర చక్రంలో సంచలనదశ మొదలవుతుంది.
అడ్డుకునే గిరుల శిరసులు తెగిపడుతుంటాయి.
రాళ్లకుప్పల మీద నాటుకున్న అరికాళ్ల రక్తముద్రలు
నిప్పుల సంతకాలై నిలుస్తాయి.
ఆ ఒక్కొక్క సంతకం
పరిణామ పథాన్ని పైకెగరేసే పతాక అవుతుంది.
అది మృణ్మయమో చిన్మయమో
గిరిగీసుకోవడమొద్దు దూసుకుపోవడం తప్ప.
గూటిలో కునుకుతీసే పక్షి
ఏ హితం నూరిపోస్తే ఎగిసిపోతుంది.
గాలి వాలు పసికడితే చాలు
నేలను కరుచుకుని పడుకున్న మట్టి బుడత
ఒళ్లు విదిలించుకుని లేస్తుంది.
తరుశాఖలతో కరచాలనం చేస్తుంది.
సృష్టికైనా దృష్టికైనా పరిణామం అనివార్యం
ఉదయంలా ఊపిరిలా.

కాలం ఎంత ఉదారంగా కదిలిపోతున్నా
కొన్నికొన్ని మొండి క్షణాలు కరిగిపోవు.
దురహంకారి ముఖంలా బిగుసుకుపోతాయి.
పసిపాపను చూసినా పాడెను చూసినా
ఒకే నిస్తబ్ధముద్ర.
ఎక్కడికక్కడ విచ్చుకుపోవాలిగానీ ఏమిటా జిగట?
నెమలి పురులు ముడుచుకు కూచుంటే
అడివికి ఊపిరాడుతుందా?
కాసేపు పడుకుంటామని కెరటాలు మొండికేస్తే
నది లెంపలు వాయించదూ?
క్షణాలైనా హిమకణాలైనా
కనురెప్పల ఆకుల అంచలాల నుంచి
బొట్లుబొట్లుగా జారిపడితేనే అందం.
అంధకారం కూడా ఎప్పటికప్పుడు
తన పుటల్ని తానే తిప్పేసుకుంటుంది.
పొద్దుపొడుపు తన తలుపు తట్టదేమని
తొక్కిసలాడుతూ వుంటుంది.
నిత్యసంచలన శీలికి నిద్రలోకూడా నిద్రపట్టదు.
వర్ణవర్ణజలపాతాల వాద్యసమ్మేళనం
నిర్విరామంగా నినదిస్తూనే వుంటుంది.
శరీరయంత్రం గదికి అంటుకుని వున్నా

చిమ్ముకు పోయిన ఆలోచనలే పాదాలై
ఆకాశాన్ని దున్నేస్తుండాలి.
విశ్రాంతి తీసుకో అంటే గాలి అసహ్యించుకోదూ?
మగతలా పడివుండమంటే మబ్బుకు చిరాకు.
ఒరలోని మెరుపుల్ని విచ్చుకత్తుల్లా ఝళిపించనిదే
ఒళ్లు నిలవదు దానికి.
ప్రతి మనిషీ అనుక్షణం కరగాలి కదలాలి
కాలానికి అశ్వగతులు నేర్పుతూ.
కొన్నికళ్లు నిత్యం కనేవి హత్యల కలలే.
చిగురాకులను కొరికేసినట్టు
పూలకుత్తుకలను పిసికేసినట్టు.
అలలు గోరీలైపోతే ఆ కళ్లకు పండగ.
ఓ పసికందు వచ్చి వాకిట్లో నిలబడితే
ఆ కళ్లలో డేగముక్కు పదునెక్కుతుంది.
అడివితల్లి పచ్చని ఒడిలో పడుకున్నా
ఆ దృష్టి ఇంట్లో వున్న గొడ్డళ్లమీదే.
వానమబ్బులు పిండుకు తాగడానికే గానీ
పేల్చేయడానికి కాదుగదా.
ఉదయం సవ్వడి వింటే చాలు
రాళ్లు కూడా మేలుకుని ఒళ్లు విరుచుకుంటాయి.
ఒక్కొక్క కిరణాంగుళి స్పృశిస్తూవుంటే

ప్రాణాలు బావుటాలై రెపరెపలాడుతాయి.
మొక్క పుట్టింది చెట్టై నీడలు వర్షించడానికే.
నీటి పరుగు నేల దాహం తీర్చడానికే.
ఏ మనిషైనా ఎందుకు పుడతాడు?
జీవితాన్ని పూయించడానికే.
ఏ కళ్లైనా ఎందుకు విచ్చుకోవాలి?
ఆకాశం కొసలను తమలోకి లాక్కోవడానికే.
సృష్టి సమస్తం ఎదురు చూస్తుంటుంది
చూపుల అద్దాల్లో ఇమిడిపోవడానికే.
చీకట్లు అడ్డు తగిలితే
నడిచే కంటిపాపలు పడిపోతాయేమో అని
నక్షత్రాలు వెంట నడుస్తుంటాయి.
వెలుగులు వెదజల్లే కళ్లలో
అసూయ పేరుకుంటే రాలేది నుసిమాత్రమే.
పుట్టుకొచ్చే ప్రతి కొత్తపొద్దుకు
నేత్రాలు స్వాగతపత్రాలు కావాలి.
మనిషిబీజం మొలిచింది నిరంతరవృద్ధికోసం.
ఏ కళ్లైనా కోరుకోవలసింది
వినాశం కాదు వికాసం
విహ్వలచిత్తానికి వికాసమన్నది ఉండదు
ఎప్పటికప్పుడే ముడిపడి పోవడం తప్ప.

కిటికీ కాస్త తెరిస్తే చాలు
దూకి పారిపోవాలనుకునే పిరికి ప్రాణాలుంటాయి.
ఎక్కడికెళతాయి పాపం
ఏ భూపార్శ్వం భద్రంగా వుందని?
డొంకల్లో పొంచివున్న కోరలు
రాళ్లమీద తమమొనలను నూరుతుంటాయి.
గాట్లుపడ్డ బతుకులు రాల్చిన రక్తంగుర్తులు
తడిరెప్పలార్పకుండా చూస్తుంటాయి.
పక్షులు తొర్రలను ఒదిలిపెట్టి బయటికి రావు.
పోగు చేసుకున్న భయాలను గింజల్లా కొరుక్కుతింటూ
గుండెకాయల్ని రెక్కల్లో కుక్కుకుంటాయి.
దుస్తుల్లేని ప్రాణాలను చూసి జాలిపడి
ఎడారి ఇసుక చేతుల్తో కప్పేస్తుంటుంది.
సమాధులపైన కాసేపు స్తిమితంగా కూర్చుని
ప్రాణాలు ప్రాణాయామం చేసుకుంటాయి.
మళ్లీ నరాలను కుదిపేసే ప్రకంపనం.
అడుగులను విసిరిపారేసే పరుగు.
పలాయనం పరిష్కారమవుతుందా?
ఆకాశానికే దిక్కులేదు.
అక్కడా ఉరిపోసుకున్న చుక్కల శరీరాలే.
మృత్యువు మిడిగుడ్లు మిటకరించేది ఇంట్లోనేనా?

సృష్టినాడిని పట్టిచూస్తే వినిపిస్తుంది
అనుక్షణం ఆ చావుచప్పుడు.
పైకప్పుకూలి పడుతుందో అని
పడుకోవడమే మానుకుంటామా?
చీకట్లు వరదల్లా ముంచుకొస్తుంటే
దీపాలు పడవల్లా తేలిపోతుంటాయి.
మనకళ్లూ వాకిళ్లూ మునిగిపోకుండా
అరిచేతుల్లో పెట్టుకుని కాపాడుతుంటాయి.
దీపం వూపిరికున్న తెగింపు
మనిషి ప్రాణానికి లేకుంటే యెలా?
డీకొన్న కెరటాన్ని తిప్పికొట్టినప్పుడే
తీరం స్థిరంగా నిలిచేది.
సంక్షోభాన్ని నిలువునా చీల్చుకు పోయినప్పుడే
సమస్యల ఆంతర్యం తెలిసేది.
ఆత్మ విశ్వాసం శిథిలమయినప్పుడల్లా
చూపుతడిసి ముద్దయినప్పుడల్లా
ఏ వెలుగువేళ్లో తాకుతాయి గోరువెచ్చగా.
మళ్లీ కొత్తఆశ
మట్టి మొలకై మాట్లాడినట్టు.
ఉభయబాహువుల్తో దిక్కులన్నిటినీ
ఒళ్లోకి తీసుకుని నిధుల్లా పొదుగుకున్నా

ఇంకా ఏదో వెలితి.
గొంతు కుట్టేసుకుంటే అక్షరాలు మూతపడవు.
నరాల కొమ్మల్లో రెక్కలెత్తి
స్వరసాధన చేస్తుంటాయి.
రాలిపోయే ఆకుల ఆర్తదృశ్యాలకు
ప్రత్యక్షసాక్షులు పక్షులు.
ఆఆర్తిని మానవభాషలో అనువదించాలనే
పిచ్చిపిట్టల తహతహ.
గాలి చూపులూ చీరుకుపోతాయి
ఇరుకు సందుల్లోంచి చొచ్చుకు పోతున్నప్పుడు.
ఎవరితో చెప్పుకుంటుంది గాయపడ్డగాడ్పు.
గుబురు పొదలను కావలించుకుని హోరున ఏడ్చేస్తుంది.
కొవ్వుపాన్పుమీద పేరుకునే సుఖానుభూతి
ఒక్క పక్క కుదుపుతో దొర్లిపడుతుంది.
నిత్య జాగృతంగా ఉన్నహృదయమే
నిటారుగా నడిచిపోతుంది.
కదలిక కేవలం ప్రాణికే కాదు
ఉదయించే ప్రతికాంతిబింబానికీ ఉంది.
వాకిలి తనఅరిచేత్తో ఎత్తే దీపాలు
వాడంతా సాగిపోతాయి.
మొగ్గముడి విప్పుకుని బయటపడ్డ సుగంధాలు

తోటంతా సంతకాలు చేస్తాయి.
పక్షిరెక్కయినా కంటిరెప్పయినా
కోరుకునేది విముక్తి.
జిగటనూనెలోనైనా జిగేలనే తీగలోనైనా
శిరసెత్తి చిమ్ముకొస్తుంది దీపదీప్తి.
నీటినుంచి తడిని విడదీయాలని చూస్తే యెలా?
ప్రకృతికీ మనిషికీ మధ్య సృష్ట్యాదిగా అల్లుకున్న
బింబానుబింబ సంబంధమది.
వేళ్లు నాటుకున్న అచల్లని పునాదులు
ఎప్పుడూ కుదురుగానే వుంటాయనుకోలేం.
ఏ పైశాచికోన్మాదమో వాటిని ఎగదోస్తుంది.
అనుబంధ విచ్ఛేదకాండ సర్వాంగ నిర్మూలనానికి దారితీస్తుంది.
మెత్తగా జుత్తు నిమురుతూ లాలించేగాలి
పచ్చని ప్రాణాలను పెళ్లగిస్తుంది.
అన్నం పెట్టిన కడలిచేతులే
వేల సజీవశరీరాలను వెదురుబొంగుల్లా విసిరేస్తాయి.
మతితప్పిన ప్రకృతి ముందు చెట్టూ మనిషీ ఒకటే.
అప్పుడు ఆ పరిసరాల్లో ప్రతిధ్వనించేవి
దిక్కులేని కంఠాల దుఃఖస్వరాలే.
ఆ నేలలో ఇంకిపోనివి
రెక్కలు విరిగిన వ్యధితుల కన్నీళ్లే.

తోటబడిలో చేర్చిన విత్తనాలు
మొలకల పాఠాలు దిద్దుతుంటే చూశాం.
ఆ మొలకలే హరితపత్రాల పట్టాలు పుచ్చుకుని
మన ఎదుట వినమ్రంగా నిలుచుంటే
దోసిళ్లకొద్దీ ఆశీస్సులు కురిపించాం.
మైళ్లకొద్దీ పరుచుకున్న ఆ పచ్చదనాన్ని
పిచ్చిగాడ్పుల విచ్చుకోరలు కొరికేస్తాయి.
జీవన వాటికలనుశవపేటికలుగా మార్చేస్తాయి.
ఉలికులికి పడుతున్న ఇసక మేటల్లో
మృత్యువు కాలిగుర్తులే కనిపిస్తాయి.
స్మృతుల తాళ్లకు ఆరేసుకున్న మృతుల ఆకృతులు
మూసుకున్న నయనాల్లో చొరబడుతాయి.
అంతటా పేరుకున్న శైథిల్యం.
సర్వాంగీణ సంవర్ధిత సృష్టికి
కీళ్లు విరిచేసినంత భయానక వైకల్యం.
అయితే విధ్వంసం ఎప్పుడూ చరమాంకం కాదు.
తరువాతి పుట విప్పితే అగుపించేది వికాసమే.
మట్టిలో అణగారిన ఆశలు
మళ్లీ అంకురిస్తాయి పాపల పసినవ్వుల్లా.
ఆ నీరే ఉగ్గుపాలందిస్తుంటే
ఆ గాడుపే జోలపాడుతూ వుంటే

మొక్కల మూలాలు జీవశక్తిని చేదుకుని
పరిణత వృక్షాలై నిలుస్తాయి
శిశువులు ఎదిగి నిలువెత్తు మనుషులైనట్టు.

అఖిల విశ్వానికి ప్రదీపక శక్తి ఆశ.
ఇన్ని ఆశల తెరలమధ్య
ఇన్ని నిరాశల పొరల మధ్య ఎలా జీవిస్తున్నామో.
ఇవి తేలిక సమస్యల కుబుసాలా?
మేధను బిగువుగా చుట్టుకున్న
విషమయ పరిస్థితుల పాము మెలికలా?
ముట్టి చూస్తే మెత్తగానే వుంటాయి.
ఆ మాదక విషరసాయనం
బొట్లుబొట్లుగా నరాల్లోకి దిగుతున్నట్టు తెలియదు.
రక్తానికి అదోరకం రుచి దొరుకుతుంది
శరీరాన్ని అరంగుళం పైకెగరేసిన స్పందన కలుగుతుంది.
అలవాటయిన ప్రాణం కదా!
మెలికల నడుమ వలయాకారంగా తిరుగుతూ
మైళ్లను కుమ్మేసిన పొగరును తొడుక్కుంటుంది.
అల్లుకుంటున్న పొరల్లో కళ్లుమూసుకుని
లోతులందుకుంటున్న భ్రాంతిని చల్లుకుంటుంది.

తలపుట్టలో ఇమడలేని ఆలోచనాశృంగం
హఠాత్తుగా పైకిలేచి చూస్తుంది.
స్వచ్ఛపవనం శ్వాసకు స్వాగతం చెబుతుంది.
కళ్లతో చేదుకోదగినన్ని
విభిన్న దృశ్యాలు తోరణాల్లా కదులుతాయి -
చిగుళ్ల అక్షరాలు దిద్దే చెట్ల వేళ్లూ
నాగళ్లకు నడకలు నేర్పే మట్టి గుండెలూ
నేలఒడిలో వాలిపోవాలని
తన రెక్కలకు తాకీదులిచ్చే మబ్బులూ.
మాటల్లోని మగత ఇగిరిపోతుంది
మనసులో పొగచూరిన బొమ్మ ఉండదు.
ఇన్నాళ్లు చుట్టుకున్నతాళ్లన్నీ
స్వప్నశకలాల్లా రాలిపడుతుంటాయి.
నిజం గగనమంత ఎత్తుగా నిలబడుతుంది.
మస్తిష్కంలోని మరుగుజ్జుతనం
తనను తాను ముక్కలుముక్కలుగా నరుక్కుంటుంది.
ఎదగడానికి గాలి అవరోధమా?
నక్షత్రాల కప్పు నడినెత్తికి తగులుతుందని దిగులా?
తూర్పు తూణీరంలోంచి దూసుకుపోయిన కిరణశిలీముఖం
ఎక్కడున్నానని వెనక్కి తిరిగి చూసుకుంటుందా?
గతికి ఎప్పుడూ ముందు చూపే.

స్మృతికి మాత్రం వెనక.
పుట్టిన సంచిలోకి మళ్లీ పోలేంకదా!
అప్పుడప్పుడు ఆ పేగుతో ఈ పేగుకు
శ్రుతి కలుపుకోవచ్చు.
మనం పొర్లాడిన నేల పొత్తిళ్లను
గుండెమీది కెక్కించి చూసుకోవచ్చు.
ముదిరి బెరడవుతున్న నాల్కకు
పసితనం పాలరుచులను అద్ది చూపొచ్చు.
స్మరణం గతవరణం కావద్దు.
నిన్న కమ్ముకున్న పొగమంచు
నేటి శిఖరాన్ని ఆక్రమించొద్దు.
ఉన్మత్త తరంగంతో కరచాలనం చేసినప్పుడే
ఉనికి పదునెక్కుతుంది.
నత్తగుల్లల్లా పడివుంటామంటే ఎలా?
మంటికీ మింటికీ మధ్య మనిషెందుకున్నట్టు?
అల్లెతాటిని బిగించినట్టు
ఆ రెంటినికలిపేయడానికే.
స్థలమాతృకనూ కాలప్రతీకనూ
అనుసంధించడానికే.
అహర్నిశలూ ఆకాశందృష్టి మనిషిమీదే.
పగలు సూర్యుని కంటిలోంచి

రాత్రి చంద్రతారకల నేత్రాల్లోంచి
మనిషిని కనిపెట్టుకుంటూ వుంటుందది.
పశుతత్వం ఆవరించిన చీకట్లు
మనిషి కనుగుడ్లను కబళిస్తాయని
నింగికి తీరని బెంగ.
తనవైపు రివ్వున మనిషి ఎగిసొస్తే
ఆ రూపంలో ధరిత్రికే రెక్కలొచ్చాయని
ఆకాశం ఒళ్లు మరిచిపోతుంది.
పసికందును గుండెకు హత్తుకున్న అనుభూతి
నురగలు నురగలుగా తరలివస్తుంది.
ఎప్పుడూ ఇలాగే ఉంటే ఎంత బాగుంటుంది.
ఆకాంక్ష వేరు అయ్యేది వేరు.
మనసు కంటిముందు
అవాంఛనీయ సంకీర్ణ దృశ్యాల దొంతరలు
పగిలిన కపాలాలతో పొరాడుతుంటాయి.
కప్పుకున్న గోచర్మం జారిపోయి
లోపలి పులిచారలు బయటపడతాయి.
పాత్రలు నోటినిండా నవ్వుతున్నప్పుడు
దంతాల స్థానంలో కోరలు పొడుచుకొస్తాయి.
అభినయించేది శృంగారమా
ఆంగిక పైశాచిక క్రీడావికారమా?

అవి జాలువారే వాలుచూపులు కావు
కాటేసేముందు కాలుదువ్వే పాముల నాల్కలు.
సంభాషణల మధ్య ఉన్మాదంనుసి రాలుతుంది.
స్క్రిప్టులోలేని పాత్రలొచ్చి
వేదిక మీద ఓంద్రపెడతాయి.
ఒకోసారి మనం చూసే జీవితచిత్రానికి
నకలులా లేదూ యిది?
ఇంతటితో తెరదించకపోతే
ఈ రూపకం రసాభాసమవుతుంది.
దించిన తెర రేపైనా లేవక తప్పదు.
అప్పుడు పాచిముఖాలను కడుక్కున్న పాత్రలు
రంగం మీదికొస్తాయి.
పరిశుభ్ర వాక్కులను రేకుల్లా వెదజల్లుతాయి.
ఈసారి మాటల అల్లిక
పూలను అంటిపెట్టుకున్న తీగల్లా ఉంటుంగి.
ఏది మూలమో ఏది శిరస్త్రాణమో
గ్రాఫుగీసి చూపినట్టుగా ఉంటుంది.
భ్రాంతి కలిగించే వెర్రితలలుకావు ఆశయాలంటే.
అవి వాస్తవాల జీవనదుల

ముసుగుల్లేని అలలు.
పక్కలో మెరుపు చక్కిలిగిలి పెట్టినప్పుడల్లా
ఆకాశానికి సరికొత్తసరదా పుడుతుంది.
మబ్బుల ఊడలను పట్టుకుని
మట్టిపాదల్లోకి జారిపోవాలని చూస్తుంది.
అది నదిని తొడుక్కుని పరుగెత్తినప్పుడు
నురగలెత్తే సుఖంతో ఒంటికి మగతొస్తుంది.
కాసేపు కొమ్మగూటిలో ఒదిగిపడుకుని
కలల కువకువలను వినాలనుకుంటుంది.
ఆ ముచ్చట ఎంతసేపు?
క్షణాలు నిమిషాల్లోకి చొచ్చుకుపోయినంతసేపు.
అసలు చిరునామా గుర్తుకు రాక తప్పదు.
తాను మేను వాల్చింది మెరుపులమీదకాదు
గడ్డిపరకల మీద.
ఏరంత విస్తరించగలుగుతుంది గానీ
గూడంత ముడుచుకోగలుగుతుందా?
కోరికకు కొలమానమెక్కడ?
వ్యాకరణానికి లోబడితే
అది వాంఛ ఎలా అవుతుంది.
పక్షికేమో పిచ్చిఅలజడి
కన్నఒడిలావున్న గూటిని విడిచిపెట్టి

కనిపించని దూరాలను దాటేసి పోవాలని.
విచ్చుకున్న ఆ రెక్కలకు ఏ స్పర్శా తగలొద్దని.
నీటిమీద మొలిచే ఆవిరి
హాయిగా కాళ్లు చాపి పడుకోవచ్చుకదా.
ఉన్నపాదును వొదిలేసి
ఎక్కడికో ఎగిరిపోవాలని ఆరాటం.
ఇవన్నీ మనిషి గుణాలే.
తాను పైనుంటే
చూపు కిందివైపుకి దిగివస్తుంది.
తాను కింద పడుకుంటే
మనసు పైపైకి లేచిపోతుంది.
తన నుదుటి మీద ఏకాస్త చెమట పట్టినా
తుడుచుకునేదాకా తోచదు.
తెరమీద అగుపడే చెమట చుక్కలను మాత్రం
ముత్యాల్లా దూసుకోవాలనిపిస్తుంది.
ముద్దుల్లో మడిచి దాచుకోవాలనిపిస్తుంది.
కళ్లకింద రేఖలుగా దిద్దితే అదికాటుక.
అదే తెల్లని గుడ్డకంటుకుంటే
మసిలా అసహ్యం వేస్తుంది.
మనిషి కొరికిన పండేమో ఎంగిలి.
అదే చిలక కొరికిందైతే సరే అనిపిస్తుంది.

ఆలింగనం చరమావధిగా ఉన్నప్పుడు
కాంక్ష ఏ ఆంక్షలకూ లొంగదు.
మధ్యలో హద్దులుగా ఉన్న ఉక్కుగోడలు
మట్టిపెళ్లల్లా చూర్ణమైపోతాయి.
చిచ్చుకు కూడా దడ పుట్టించే ఉష్ణోగ్రత
వాతావరణాన్ని రగిలించివేస్తుంది.
ఆ ఒక్క కౌగిట్లో దిక్కులన్నీ ఇమిడిపోతాయి.
సాక్షిలాంటి గాలికే మైకమొచ్చి
ఆ అద్వయ దేహాల మీదే వాలిపోతుంది.
లోయ మెత్తనివేళ్లు స్మృతిని తట్టేదాకా
వేళ తెలియదు ఆ మిథునానికి.
లోయలో ఒదిగివున్న అంబరం
ఆ సుఖయోగాన్ని అంతవరకు పండించుకోలేదు.
కౌగిలించుకుందామంటే సూర్యబింబం
నిరంతర జ్వలనం ఆగదు.
చంద్రబింబం అసలే ఆనదు.
చుక్కలు పిచ్చుకల్లా జడుసుకుని పరుగెత్తుతాయి.
పోనీ లోయనైనా హత్తుకుని ఉండాలనుకుంటుంది
నింగి కోరికను పసికట్టిన మనిషి
ఆ అవస్థా వైచిత్రికి విస్తుపోయి నిష్క్రమిస్తాడు.
ఏటిలా పారే లోయలో

ఆకాశం దివారాత్రాలు జలకాలాడుతుంది.
తడిసిన ఒంటికి గాలివలువలు చుట్టుకుని
నీటిఅద్దంలో చూసుకుని మురిసిపోతుంది.
పాకుడుపట్టిన పర్వత సానువులకు వీపును ఆనించి
జలపాత వేణికలా జారుతుంటుంది.
ఈ కలవరమంతా దేనికి?
కలయికలో తన అస్తిత్వం కోల్పోవడానికి.
అద్వైతమంటే అదేమరి.
సముద్ర గర్భంలో కలిసిపోయిన నది
తన పూర్వరూపాన్ని తలచుకోదు.
పువ్వుకు వీడ్కోలు చెప్పి
గాలి గుండెల్లో నిండిపోయిన పరిమళం
పుట్టింటికి తిరిగిపోవాలనుకుంటుందా?
ఆనవాలు లేకుండా కరిగిపోవడం
అదృశ్యరూపంలో దూరదూరాలకు పరచుకోవడం
ఏ కలయికకైనా జీవ ధాతువు.

భూమి బుర్రలో వికటప్రశ్న తొలుస్తుంది
ఆకాశం అస్తిత్వం ఏమిటని?
"నాకు సమగ్ర వర్తులాకృతి ఉంది.

యుగాల తరబడి నిలదొక్కుకుని ఉండడానికి
లోతుల్లోకి దిగిన చరణాల మూలాలున్నాయి.
పాలమబ్బులను పాగాలుగా చుట్టుకునే
సమున్నత శైలశిరస్సులున్నాయి.
నా హరిత ప్రకృతి రామణీయకాన్ని
నోరారా గానం చేస్తూ ఊరూరా తిరిగే
ధారావాహిక నదులున్నాయి.
నా అగాధ మనోగాంభీర్యాన్ని
కరళ్లెత్తి హోరెత్తి ఉద్ఘోషించే
జలరాశుల గళకోశాలున్నాయి.
శూన్యంలా ఆద్యంతాలు లేని మింటిని
అంటిపెట్టుకున్న వేమిటి?
చలనం కోల్పోయి మండిపడే మార్తాండబింబం
అనాథల్లా అవురంటూ తిరిగే గ్రహతారకామండలం.
నా నియత పరిభ్రమణం వల్లనే కదా
సూర్యుడు దివాకరుడయ్యింది.
చంద్రుడు నిశాకరుడయ్యింది.
ఉనికే లేని గగనాన్ని దివిగా భావించి
ఏవో అతీత శక్తులున్నాయని భ్రమించి
నిక్కిచూసే అమాయకమతులున్నారు కాబట్టే
ఆకాశం ఆ మాత్రం వాక్కులకెక్కింది.

నా రొమ్ము మీద దోగాడే మనిషి చూపుల్ని
ఎరవేసి లాక్కుపోవాలని
గ్రహాలు నిత్యం కుట్రపన్నుతుంటాయి.
తాను వట్టి శూన్యాన్ని కానే కాదని
తన ముంగిట్లో రహస్య నిక్షిప్త నిధులున్నాయని
నా వాళ్లకు వన్నెవన్నెల కబుర్లు పంపుతుంటుంది
అశరీరవాణి.
పసివాళ్లు కదా నా వాళ్లు.
రాకెట్ల రెక్కలతో పైకెగిరిపోయి
ఏ చచ్చు గ్రహం మీదనో కాసేపు వాలి
తట్టెడు మట్టిగడ్డలు ఇంటికి తెచ్చుకుంటారు.
రత్నగర్భగా ఉన్ననాకూ
నిత్యరిక్తంగా ఉన్న నింగికీ పోలికేమిటి?
నా ముఖం వికసిస్తే పొద్దుపొడుపు.
చిరునవ్వు చినుకు చిలకరిస్తే వెన్నెల పిలుపు.
చేతులు సాచి సాగితే ప్రవాహసూత్రం.
నిస్తంద్ర మంద్రగీతంగా మోగితే సాగరగాత్రం.
నా వ్యక్తిత్వం అనన్యం.
అసదృశ వైభవ మూర్ధన్యం."
భూమి బుర్ర కిర్రెక్కిపోతుంది.
అవధులను కమ్మేసిన అహంభావుకత

దిశల కొసలను నలిపేస్తుంది.
హఠాత్తుగా ఓ ఉరుము ఉరుముతుంది.
భూమి చెవుల్లో పొగలు గుప్పుమంటాయి.
ఫెళఫెళమంటూ ఓ పిడుగు విరుచుకుపడుతుంది.
భూమినరాలు భగ్గుమని బూడిదైపోతాయి.
తన కళ్లను తానే నమ్మలేకపోతుంది.
కన్నీరు తుడిచే చల్లగాలి వేళ్లను
తన గుండెకు హత్తుకుంటుంది.
దురహంకారం విరిగి పడిపోతుంది
విద్యుద్ఘాతం తగిలిన ధ్వజస్తంభంలా.
అవనిని అమ్మను చేసిన మట్టిచేతులు
ఆకాశం వైపు లేస్తాయి ప్రార్థనా ముద్రలో.
ఎంతెంత ఎత్తుల్లో ఉంటున్నా
ఆకాశానికి సముద్రమంటే కన్ను కుడుతుంది.
అంత విస్తృతంగా పరుచుకునివున్నా
చలనంలేని బతుకు తనది.
పగటి వెలుగులో పైనుంచి చూసినప్పుడల్లా
తల తిరిగిపోతుంది.
ఏమి కెరటాలవి?
డెక్కలానించని తెల్లని గుర్రాలు మెడలు రిక్కించుకుని
స్లోమోషన్లో ఎగిసిపోతున్నట్టు.

అవి పాలనురగల్లా రొమ్ముమీద కదలాడుతుంటే
మాతృమూర్తిలా గొప్పగా ఉప్పొంగిపోతుంది
ఉత్త ఉప్పునీటి కడలి.
ఏ నేపథ్యంలో దాచుకున్నదో
ఏవేళ్లు మీటుతున్నాయో ఆ వేనవేల తంబురాలను
ఒకే మంద్ర గంభీరశ్రుతి.
సమస్త ప్రకృతిశ్రవణాలను సుఖంగా ఆకట్టుకునే
నిర్ఛిద్రనాదగతి.
తానూ అలా అలలెత్తి పోవాలని
ఆకాశం అతలాకుతలమవుతుంది.
ఏవో పొగమబ్బుల పొర్లింతలు తప్ప
అలపుట్టదు జలపుట్టదు.
హోరున కురిసే మేఘాలను పొదివి పట్టుకుని
తనలోకే వొంపుకుందామంటే
అవి ఎప్పుడూ చేయి జారిపోయేవే.
ఎంత దగాకోరులో వానమబ్బులు
తన ఇంట్లో పుట్టి తన వాకిట్లో గజ్జెకట్టి
పరాయి కొంపలో చేరిపోతాయా?
కాలం తన అరిచేతి ఇంద్రజాలం.
సూర్యుడంతటివాడే తన చూపుడు వేలు.
అహంకారం నెత్తికెక్కిన నింగి

అంధకారానికి శాసనం జారీ చేస్తుంది
ఎక్కడా సందులేకుండా కడలిని కమ్ముకొమ్మని.
పర్యవసానం ఏమిటా అని
కటిక చీకట్లో తనకళ్లు చించుకుని చూస్తుంది.
నక్షత్రాల జిలుగు వెలుగుల్లో
అవే జలతారు నురగల పరుగులు.
నక్షత్రాల కుత్తుకలు నొక్కేయాలనిపిస్తుంది.
అవేవీ చేతికి చిక్కవు.
ఓపిక చచ్చి హుంకరిస్తుంది.
ఉరుములు పుడతాయి తరగలు కాదు.
పెట్రేగిన అసూయతో భుగభుగలాడిపోతుంది
పిడుగులు పుడతాయి నురగలు కాదు.
తడి మనసుంటేనే కదా ఉదయించేది
తరగలైనా నురగలైనా.
కాలాన్ని శాసించే అంతటి ఆకాశానికి
అది తాత్కాలిక మతివిక్రుతి.
అంతే అనుకోవాలి మరి.
ఇంద్రియలౌల్యం మనిషికేకాదు సముద్రానికీ ఉంది.
అడుగడుగునా అవరోధాల్లేని స్వేచ్ఛావిహారం తనది.
అత్యున్నత గగనగాత్రం వంగి
తన జలముకురంలో ముఖం చూసుకుంటుంది.

పొంగినంత ఎత్తు తనదే.
పొర్లినంత మేర తనదే.
అందదేమో అన్నంత లోతు తనదే.
ఎంతెంత వైభవమున్నా తొలిచేసే ఏదో తపన.
అస్తమానం తనలో తానేనా?
అంతుపట్టని అంతఃకల్లోలమేనా?
తరంగాల కరాంగుళులతో ధరిత్రిని స్పృశించినప్పుడు
ఎన్నెన్ని పులకింతల దొంతరలు.
కొన్ని క్షణాలే అయినా మెత్తని ఇసుకను ముద్దాడినప్పుడు
ఎంతటి అనిర్వచనీయ రుచి.
అందుకున్న అనుభవాన్ని జ్ఞాపికగా తీసుకెళదామంటే
ఆ రుచి మరిగిన నురగలు తీరాన్ని అంటుకునే వుంటాయి.
తనవెంట తిరిగి రామంటాయి.
చెలియలికట్టల సంకెళ్లను పగలగొట్టుకుని
సడలని కౌగిట్లో పుడమిని పొద్దంతా ముంచెత్తితే
గుండెలవిసిన జనఘోష వినాల్సివస్తుంది.
పరిష్వంగసుఖం తనకు ఎలాగూ లేదు
పోనీ శ్రవణసుఖమైనా.
తరగలన్నిటినీ చెవులుగా చేసుకుని
విశ్వంలోని విభిన్న నాదాలను తనలో
ఒలకబోసుకోవాలనుకుంటుంది.

ఉలుకు తప్ప పలుకు చేతగానివి
తన నీటిపొరల్లో కదలాడే ప్రాణులు.
ఎక్కడో అరణ్యగర్భంలో ప్రతిధ్వనించే క్రేంకారాలు
కొనకొమ్మలపై ఉవ్వెత్తుగా ఎగిసిపడే కూజితాలు
తన దరిదాపుల్లోకి రావే.
పైపైన ఎగిరే పక్షుల కిలకిలలు విందామన్నా
తనను అనుకుని కూచున్న పడుచుజంటల సల్లాపస్వరాలను
కర్ణతంత్రుల్లోకి ఎక్కించుకుందామనుకున్నా
సుడులు తిరిగే తన హోరులో అవి మునిగిపోతాయి.
అప్పుడప్పుడు మలయపవనం గుప్పున విసిరే సుగంధాలను
గుండెనిండా ఆఘ్రాణించాలనుకుంటే
ఆ గడుసుగాలి అంతలోనే చేజారిపోతుంది.
చూసిన శూన్యాన్నీ పరుచుకున్న నైల్యాన్నీ
చూసేది ఎంత కాలమని?
తన తరళతరళ నేత్రాలు తపించి పోతున్నాయి
వర్ణవర్ణ దృశ్య వైవిధ్యం కోసం.
నదులు తాము దర్శించిన జగత్ సౌందర్యాన్ని
అహర్నిశలు వందిమాగధుల్లా అభివర్ణిస్తూవుంటే
మాత్సర్యంతో తన శ్వాస మడతపడక ఏమవుతుంది?
అగుపడని ఇంద్రియాలున్న
సముద్రం అంతరంగంలోనిది ఈ తీవ్రక్షోభ.

అంతేకాదు.
మరో పార్శ్వంనుంచి పరికిస్తే
పంచేంద్రియాల మహేంద్రజాలాల్లో
తన చిరునామా పోగొట్టుకునే మనిషిదీ ఇదే స్థితి.

కాలం ఘనీభవిస్తే పర్వతం.
కరిగితే మంచు.
పారిపోతే ఏరు.
వృత్తంలా పరిభ్రమిస్తే సుడిగాలి.
అగోచరంగా వున్న కాలానికి
దృశ్యంగా అవతరించాలని నిరంతరతృష్ణ.
మిణుకు మిణుకుమనే నక్షత్రాల జిలుగులు
ఆ తృష్ణకు ఆవిష్కరణలే.
రాత్రివేళలో జంతువుల కళ్లలో వెలిగే బల్బులు
ఆ పార్శ్వానికి తార్కాణలే.
ఎక్కడా దిక్కుతోచక పోతే
కాలాత్మను తొలిచేసే కాంతితపన
మిణుగురుపురుగుల తోకల్లో కనుగుడ్లు మిటకరిస్తుంది.
చీకటి కమ్మినప్పుడల్లా వెలుతురు చచ్చిపోతుందా?
గుహల్లో గుడిసెల్లో బొరియల్లో కలుగుల్లో

తలదాచుకుంటుంది.
నడిచినడిచి చితికిపోయిన అడుగులను
నిట్టూర్పుల వినవక్రలతో ఓదారుస్తుంది.
గుడారాలు వేసుకున్న చీకటికుట్రదారు
ఉడాయిస్తున్న తొలివార్త
పక్షుల గొంతుల్లోంచి పాకల కొప్పుల్లోంచి
కిటికీల పెదవుల్లోంచి వినిపించగానే
కాలం ముద్దగా పొద్దుగా మారి
తూర్పు దిశకెక్కుతుంది.
స్థలకాలాల మధ్య సజీవవారధి మనిషి.
నేత్రపత్రాల మధ్య ఎన్నెన్నిదృశ్యాలు ముద్రించుకున్నాడు.
పగలబడి నవ్వే పగళ్ల పొగరువాలకాలకు
తానూ పొడిగా నవ్వుకున్నాడు.
కుమిలి కుమిలి ఏడ్చే రాత్రుల గర్భవేదనలకు
తానూ కుమిలి కుంగిపోయాడు.
అన్నిటికీ తాను.
అందరిలో తాను.
అయినా పరవళ్లుతొక్కే సమూహఘోషలో
తనది ఒంటరి కుంటికేక.
తన మనసూ ఉన్మాద తరంగితమవుతుంది.
వేసే ఆ చిందుతో లయ కలిపే

సహచరణాలేవీ?
తాను కన్నీటిచెరువై పోయినప్పుడు
పదిబిందువులను చూపుల్లో నింపుకునే
సానుభూతి మతులెక్కడ?
అవనికీ అంబరానికీ తాను వేసిన పీటముడి
పురులు పురులుగా విచ్చుకుని పోతూవుంటే
బిగించే అకంపిత హస్తమేదీ?
ఆ మీద ఉన్నదంతా కొల్లగొడదామని
ఈ కిందిది పైకెగిరి పోతే
ఇక్కడ మిగిలేది
అఖాతంలా ఆవులించే నీలిశూన్యమే.
సూర్యచంద్రగ్రహతారకలను
నాకేసిన విస్తర్లలా విసిరిపారేసి
భూశయ్యమీద వెల్లకిలా పడుకుంటే
ఆకాశం తిరిగి లేవలేని శవకోశమే.
స్థలకాలాల పరస్పరాతిక్రమణం
సృష్టిగర్భమూలబీజ విస్ఫోటకరణం.
కాలరహస్య జిజ్ఞాస
మానవమేధను కదిపే నిరంతరపిపాస.
కాలస్వరూపం మనసులా అరూపమా?
అనంతశూన్యంలా అవ్యక్తమా?

మనిషినేత్రం ఎంత లలితమో అంత నిశితం.
పొరలను తొలుస్తూ పోతుంటుంది పదునుచూపు.
పొడి రాలినట్టుగానే అనిపిస్తుంటుంది.
ఆశించిన నిర్దిష్టసత్యం మాత్రం అగోచరం.
వాడితప్పిన చూపు కంటిఒరలోకి తిరిగొస్తుంది.
ఆలోచన ఉద్విగ్నమై అంతరిక్షంలోకి దూసుకుపోతుంది.
ఆ కొసనుంచి ఈ కొసదాకా తిప్పేసి చూస్తుంది.
ఎక్కడా ఏ ఆనవాళ్లూ కనిపించవు.
కనిపించని కాలమా నీ ఉనికి ఎక్కడ?
అంతటా ప్రసరించిన భ్రాంతిని మంత్రించే నీ నిడివి ఎంత?
స్వరమెత్తిన ప్రశ్నలు నిరుత్తరంగా స్తంభించిపోతాయి.
సూర్యుడు ఉదయాస్తమయాల నిత్యనిర్దేశకుడు కదా.
ఆ సూర్యబింబాన్నే కొలబద్దగా పట్టుకుని
కాలం అంతుచూడాలని సంకల్పిస్తాడు మనిషి.
సాహసించి సాచినచేయి భగ్గుమంటుంది.
గ్రహాలను పట్టుకుని పరిభ్రమించి చూస్తే -
మధ్యలో పట్టుతప్పి పడిపోయే ప్రమాదముంది.
ధరాగోళంపై నిలబడి పరిశీలిస్తే -
అమాంతంగా చీకటొచ్చి అగాధంలోకి తోసేస్తుంది.
మనిషి మేధాజలధిలో మధనం మొదలవుతుంది.
సహజాత సృజనాహంకృతి కత్తెర రూపంలో ఉబికొస్తుంది.

అదృశ్య కాలాకృతిని కత్తిరిస్తూ పోతాడు మనిషి.
కత్తిరించిన కాలవస్త్ర భాగాలను
దుప్పట్లు మొదలుకుని జేబురుమాళ్లవరకు
స్మృతినిలయంలో భద్రపరుచుకుంటాడు గుర్తులుగా.
పర్యవసానం పసికట్టినవాడు మరేం చేస్తాడు?
కాలం నిడివి ఏ కొలమానాలకూ అందనంత.
తనకున్న స్మృతిచేతన చిట్టెడంత.
యుగాలనీ శతాబ్దాలనీ దశాబ్దాలనీ సంవత్సరాలనీ
మాసాలనీ వారాలనీ
కాలఖండ ఫలకాల మీద పేర్ల ముద్రలు వేశాడు.
చెదిరిపోని జ్ఞాపకాల గోడలమీద
నిరవధిక కాలాన్ని క్యాలెండర్‌లా వేలాడదీశాడు.
అంతటితో ముగిసింది ఆ అన్వేషణ.
అహంకారాన్ని కుదిపిన మౌలిక సమస్యకు
అది హేతునిర్ణీత పరిష్కారమా?
కానేకాదు.
కాలం ఖండఖండాలుగా విడిపోనే పోదు.
కత్తితో నరికేస్తే జలం ముక్కలవుతుందా?
ముష్టిఘాతాలు ప్రయోగిస్తే గాలి బద్దలవుతుందా?
వెలుతురులో నల్లటి గీతగీస్తే దాన్ని విభజించినట్టా?
భూతవర్తమాన భవిష్యత్తులు

పరిమిత మానవమేధ నిలబెట్టుకున్న సైన్‌బోర్డులు.
ఇదిగో వర్తమానమని ఉచ్చరిస్తుండగానే
అది గతంలోకి జారి చతికిలబడిపోతుంది.
అదిగో భవితవ్యమని వాకిలి తెరుస్తుండగానే
అది వర్తమానంలోకి వచ్చి నిలబడుతుంది.
స్థలాన్ని గీట్లుగీసి చూపినంత సులభంకాదు
కాలాన్ని కొలిచి చూపడం.

చెట్టుకింది నీడలా ఉంటుంది శైశవం
ఆడుకోవడానికి నేలబడి చాలదు.
ఎక్కడికైనా పరిగెత్తుకెళ్లాలని చూస్తుంటుంది.
ఎక్కడికని పోతుంది?
చుట్టూ తల్లుల్లా కాపలాకాసే చెట్లే.
సుఖంగా నిద్రపోవే పసితనమా అని జోకొడితే
పక్క కుదరదు.
పొరపాటున కన్నంటుకుంటే
కలల కదలికలు.
తాను పక్షిగా మారిపోయినట్టు.
గూటిని కాలిబంతిలా దూరాలకు తన్నేసి
రెక్కలతో గాలిపాయలను గిలకొట్టినట్టు.

తేలిపోయే మబ్బు నిలిచిపోతుంది
కొమ్మకు కట్టిన ఉయ్యాలలా.
ఉయ్యాలలూగే శైశవం కేరింతలతో
తన గొంతును శ్రుతి కలిపిన ఆకాశం
పిల్ల చుక్కలను నేస్తాలుగా పంపిస్తుంది.
పసితనమూ చుక్కలూ కలిసి గంతులేసి
సరదా తీరక శూన్యంలోకి దూకేస్తాయి.
ఉలికిపడ్డ శైశవానికి తెలుస్తుందప్పుడు
తాను చెట్టుకింద నీడనేనని.
నీడ తన పరిధిని దాటి వెలుతురవుతుంది.
వెలుతురులా సంచలించే యవ్వనానికి
రాళ్లూ ముళ్లూ కనిపించవు.
ఎదురుగాడ్పులకు ఎదసాచి స్వాగతం చెబుతుంది.
గిరిశిఖరాల మధ్యవున్న అంతరాలను
మెరుపుపట్టీలతో కొలిచి చూపుతుంది.
యవ్వనవిజృంభణ అక్షతంగా సాగుతుంటుంది.
నేలమీద కాలు ఆనిస్తేకదా
ముళ్లంటూ గుచ్చుకునేది.
అంతా గమనిస్తున్న కాలం నవ్వుకుంటుంది
అశరీరంగా అలవోకగా.
యవ్వనంనరాలను పీల్చేసే సిరంజి ఆనవ్వు.

పరిణామం అపరాహ్ణంలోకి ప్రవేశిస్తుంది.
పొద్దు వాలుతున్నంత నీరసంగా
ఉసూరంటుంది యవ్వనం.
ధగధగలాడిపోయే దర్పం వెలిసిపోతుంది.
ముల్లుమొనకాదు రాతిముక్క తగిలినా
అరికాలికి చురుక్కుమంటుంది.
కీళ్లసత్తువ చెమటలా కారిపోతుంటుంది.
ఒళ్లంతా ముడతలుపడ్డ వెలుతురు
మసకబారిన చూపులతో తడుముకుంటూ
పొగలాంటి చీకటిలో కలిసిపోతుంటుంది.
ఏమో
రేపు మళ్లీ కనిపిస్తుందో యేమో
పచ్చని చెట్టుకింద ఆడుకునే పసినీడలా.
స్వప్నం రెక్కవిప్పినప్పుడల్లా
యధార్థం ముడుచుకుపోతుంది.
స్వప్నమంటే మరేమీకాదు
అసంపూర్త చింతన మూర్తికట్టిన చిత్రం.
అది ఒక్కొక్కప్పుడు కంటిచక్రంలో ఇముడుతుంది
బాల్యం కట్టుకున్న ఇసుకగూడులా అమాయకంగా కుదురుతుంది.
మరి ఒక్కొక్కప్పుడు వర్ణవర్ణ ధూమతరంగాలతో
రోదసినిండా విస్తరిస్తుంది.

అప్పుడు దేహం తనసుతాను తడిమి చూసుకుంటుంది.
అక్కడ అది ఉంటేకదా!
అంతటా స్వప్నకవితా స్వచ్ఛందసంచారమే.
అన్వయాన్ని ఛేదించిన వాక్యాల్లా
అసంబద్ధ మూర్తిశకలాలు వేలాడుతుంటాయి.
అవ్యక్తత పాటమరించే అరాజకప్రీతి
సమస్తనాళాల్లో ప్రసరిస్తుంది.
మొత్తం దేహం మసకమత్తులోంచి
ఉన్మత్త మనోదశలోకి మెత్తగా జారిపోతుంది.
కత్తెర పట్టుకుని కూర్చునే వాస్తవిక దృష్టి ఏదీ?
తట్టి చూద్దామంటే
ఆలోచనల చేతివేళ్లు అదృశ్యమై పోతుంటాయి.
పిచ్చిలా అనిపించినా ఆ తీపి దానిదే.
స్వార్థానికి తగులుకున్న ఆ ముగ్ధలాలసత
స్వప్న మాదకతే.
ఐశ్వర్యకాంక్ష పొదరింటిలా అల్లుకుపోయేది
పదవీప్రలోభం అడుగడుగునా రుచులు పుట్టించేది
ఆ మాదకత ఆవరించినప్పుడే.
మునిలా తపస్సు చేసుకునే మనస్సుకూడా
కల సృష్టించే మెత్తని అలికిడికి చలించిపోతుంది.
కలను శపించాల్సిన నైష్ఠిక మతి

కౌగిలిపాలై పోతుంది.
మోహబాహువుల్లో చుట్టుకుపోవడమంటే
స్వప్నవాహినిలో కొట్టుకుపోవడమే.
యథార్థం కటికనిప్పులా ప్రజ్వలిస్తున్నా
కాస్తంత స్వప్నఛ్ఛాయ పడక తప్పదు.
స్వప్నమే సర్వమనుకుంటే ఫలితం
సర్వాంగపతనం.
అల విరిగినట్టే కల విరుగుతుంది.
అది తెలుసుకున్న నిర్మల జలసదృశ నయనం
పొరలు కమ్మని వాస్తవికతకు కొలమానం.
నిద్రకూడా అప్పుడప్పుడు మొరాయిస్తుంది.
మూసుకున్నకళ్లు మొరపెట్టుకున్నా దగ్గరికి రాదు.
కనురెప్పల కప్పుల కింద
మూల్గుతూ పడివుండలేని చూపులు
తెరిచిన దిక్కును వెతుక్కుంటూ ఉంటాయి.
కాలం ఈదుస్తూ పోతూవుంటే
నిద్రను తామే బహిష్కరించామని సగర్వంగా చాటుకుంటాయి.
ఎంతసేపని ఆ నిరాశ్రయస్థితి?
వెనక్కి వెళ్లిపోతే నిద్ర ఎకసక్కెమాడదూ?
ఇంతలో ఓ పండువెన్నెల రవ్వ
కిటికీలోంచి గదిలోకి రాలిపడుతుంది.

నిన్న వీధిమలుపు తిరుగుతున్నప్పుడు
తళుక్కున పలకరించిన చిరునవ్వే అది.
ఏరుకుని పర్సులో దాచుకోవాలనిపిస్తుంది.
చేతికందితే కదా!
అదృశ్యమైన ఆ ముఖం ఇప్పుడెక్కడుందో?
తన వెన్నెలనవ్వును కిటికీలోపలికి విసిరి
పక్కనే నిల్చుని నవ్వుకుంటుందేమో.
అరువు తెచ్చుకున్న వెలుతురే వెన్నెలని
అంటారు శాస్త్రజ్ఞులు.
అయితే అది పెదవిమీది మృదుహాసం ఎలా అయింది?
అరువుసరుకు మౌలికమవుతుందా?
మబ్బుల కురులార్చుకుంటూ తేలిపోతుంటే
చంద్రబింబమే అందమైన ముఖమవుతుంది.
ఎంత పేరాశ కంటికి?
చుట్టూ కనపడే లావణ్యరాశులతో తృప్తిపడక
గ్రహాల్లో రమణీయబింబాల్ని సందర్శిస్తుంది.
చీకటిని కూడా వొదిలిపెడుతుందా?
మెత్తని జుత్తులా నిమురుతుంది.
ఆ జుత్తుతోనే వదనబింబాల్ని కప్పుతూ విప్పుతూ
వెర్రివేడుక అనుభవిస్తుంటుంది.
నిద్ర నీల్గుడు తగ్గి చూపులను బుజ్జగిస్తుంది

కళ్లగూళ్లకు తిరిగి రమ్మని.
తూగుతూ తిరిగొచ్చి మేనువాల్చిన చూపులు
నీలాకాశం పిలుపునందుకుంటాయి.
రంగు వేసుకున్న అవనిలా ఉంటుంది ఆ లోకం.
అయితే మధ్య మధ్య గట్లుండవు గీట్లుండవు.
కాడలు లేని పూలలాంటి చుక్కలుంటాయి.
కొన్ని రూపాలు ప్రతిరూపాలుగా ఉంటేనే సొగసు.
ముట్టుకుంటే మొరటుగా తగిలే పదార్థాలు
అద్దంలో అగుపించినప్పుడే
ఆహ్లాదాన్ని పోతపోస్తాయి.
భ్రాంతికీ వాస్తవికతకూ ఉన్న అంతరం అదే.

నక్షత్రాలను సంచిలో వేసుకొచ్చామంటే నమ్మేదెవరు?
పగటికళ్లకు గంతలుకడితే చీకటి పడ్డట్టా.
హాల్లో చమక్కుల స్ఫుత్నిక్కులనెగరేసే
ఇంద్రజాలం నిలిచే నిజమవుతుందా?
భ్రాంతికున్న ఆకర్షణ వాస్తవానికి లేకపోవచ్చు.
నైలాన్ నగిషీలు ఖద్దరుకుంటాయా మరి?
పొగమంచుతెరల జిలిబిలి ముచ్చట్లు కాసేపే.
ఎప్పటికీ శాస్త్రాన్ని మించిన అస్త్రంలేదు.

సి. నారాయణరెడ్డి

హేతువును మించిన మౌలిక జీవధాతువులేదు.
విచ్చుకున్న వివేకాక్షి
అగుపించని గాలిని కోసి చూపేంత నిశాతం.
పాపం పిచ్చి హృదయాలు
గాయపడ్డప్పుడల్లా రెండు చేతులూ పైకెత్తుతాయి.
గాయపడ్డరాయి శిల్పమవుతుంటే
మానవశిల్పాలు నీరుగారిపోతాయెందుకు?
కాళ్లు నేలమీద ఆనించి
పైకి తేలిపోవాలని పలవరిస్తుంటారు.
అదృశ్యవాణిని వినాలని ఉబలాటపడుతుంటారు.
ప్రకృతి ప్రసారంచేసే దృశ్యచరణాలు
వాళ్ల కంటికానవు.
తలబద్దలైనా సరే అల ఢీకొడుతుంది
అడ్డునిలిచిన పర్వతమూలాన్ని.
ఈకలూడిపోయినా సరే
విహాయసానికి ఎదురీదుతుంది పిడికెడు పక్షి.
కడుపు చిట్లిపోతున్నా
పచ్చని మొలకను ప్రసవిస్తుంది విత్తు.
ఆశలు విరిగినప్పుడల్లా వ్యక్తిత్వం విరిగిపోరాదు.
కొమ్మలను నరుక్కొని పోతే
వేళ్లు తమ నాల్కలను బయటపెట్టవు.

మనిషికి కావలసింది
మత్తులో తలను కోల్పోయే పూనకం కాదు
నిజంపాదులో నిటారుగా మొలిచే నమ్మకం.
పెంచుకుంటున్న నమ్మకాలను తెంచేసే దుర్మతులున్నాయని
ఉన్న చోటును వొదిలిపెట్టాలా?
ఇంతటి నాగరికతను గాలికొదిలేసి
మారుమూల గుహల్లోకి వెళ్లాలా?
పులినోరులాంటి గుహలోనుంచి బయటపడేకదా
గాలిలో జింకలు ఈతకొట్టే
గరికపచ్చ మైదానాల్లోకి చేరుకున్నాం.
పచ్చిమాంసం దిగే పంటిమొనలకు
పండ్లగుజ్జు రుచి చూపించాం.
అక్కడక్కడే తిరగమరిగిన ఆదిమపాదాలు
మైళ్లకొద్ది మజిలీలను
కొనగోళ్లతో మీటుకుంటూ పోయాయి.
కాలానిది నిత్య పురోగమనశీలం.
గడియారం ముళ్లు వెనక్కితిప్పితే
దూసుకుపోయే వర్తమానం తిరోగమించదు.
ఇప్పుడు మనం చూడవలసింది
సినిమారీళ్లలో శూలాలెత్తుకు తిరిగే
ఆటవిక భయానకదృశ్యాలు కాదు.

మనలో మనతో శిరసెత్తుకు తిరిగే
భూమిపుత్రుల దళితగాత్రాలు.
ఇక్కడ పుట్టిన ఈ తొలిచూరు బిడ్డలు
తరాల తరబడిగా తొక్కుడుపడిన మట్టిబెడ్డలు.
వట్టిబెడ్డలని విసిరికొడుతూవుంటే
ఉరిమే గొంతుకలై విచ్చుకుంటున్నాయి.
ఎక్కుపెట్టిన మాటలను
తొక్కేకాళ్ల పిక్కలకు గురిపెడుతున్నాయి.
ఏళ్లకొద్ది రాయిలా పడివున్న మౌనం
పేలిపోతున్నది మందుపాతరలా.
దమననీతికి నోరెండుకుపోయి
నరాల్లో జడుపుబుడగలు పుడుతున్నాయి.
నక్కదారులు వెతుకుతున్నారు వక్రమతులు.
మట్టిబెడ్డల మార్తాండనేత్రాల నుంచి
ఎలా తప్పించుకోగలుగుతారు.
సిమెంటు కట్టడాలకింద అణిచేశామనుకుంటే
పునాదులను పెళ్లగించుకొస్తారు భూమిపుత్రులు.
ఆ గుండెలకున్న దమ్ము ప్రభంజనమంత.
ఎప్పుడైనా గుహల్లోకి వెళ్లిపోతుందా ప్రభంజనం?
ప్రత్యక్షంగా సమస్తజనసమక్షంగా
దౌష్ట్యంమీద విరుచుకుపడుతుంది

పట్టుతప్పే సమధర్మాన్ని నిలబెడుతుంది.
అన్వేషణ మొదటధరా పరిధిలో మొదలవుతుంది
ఆపైన రోదసీమండలాన్ని స్పృశిస్తూ
ఊర్ధ్వముఖంగా సాగిపోతుంది.
గ్రహాల సహభ్రమణాన్ని అనుశీలిస్తూ
గగనచుంబకంగా తయారవుతుంది.
ఏ దశలో జరిగినా అన్వేషణంటే తవ్వకమే.
ఇటు నేలతవ్వకం ఇప్పటిది కాదు
మనిషి పుట్టినప్పటినుంచీ జరుగుతూనేవుంది.
పుచ్చిపోయిన బొమికలు తప్ప
స్వచ్ఛమైన జ్ఞాపకాలు దొరకలేదు.
అటు ఆకాశాన్ని తవ్వి చూస్తే -
అక్కడ దొరికినవి ముక్కలై చెదిరిన చుక్కల గోళ్లే.
దూసుకుపోయిన ఊహాస్త్రాలు కావు.
మరి సముద్రాలను తవ్విపారేస్తే -
తెగిన జలతంత్రుల మూల్గులు తప్ప
అగాధాల్లోంచి తోడి తెచ్చిన గాంధర్వ స్వరాలు
అలల పెదవుల మీద వినిపించలేదు.
హృదయాన్ని తవ్వనక్కరలేదు.
తడిమిచూస్తే చాలు తట్టిచూస్తే చాలు
తనలోని సమస్తాన్ని ఒలకబోసుకుంటుంది.

విశ్వబాష్పాలను దోసిళ్లతో తీసుకొచ్చి
పసికందుల్లా పొదుగుకుంటుంది.
గుండెను తవ్వితే
గునపంమొనకు నెత్తురంటుకోదూ?
నిర్మల మౌనదర్పణంలో
తన ప్రతిబింబం చూసుకుంటుంది హృదయనాదం.
విదిలిస్తే నాదముఖం బద్దలైపోదూ?
ఎక్కడ న్యాయాన్ని తొక్కేసినా
ఇక్కడ గుండెమీద ఇనపబూట్లు దిగుతాయి.
తలచుకుంటే తెలుస్తుంది ఆ గాయాలలోతు.
మూరెడు చర్మాన్ని గుండెలో ఆరేస్తే
అది డప్పైమోగి నిప్పులను కురిపిస్తుంది.
ఇన్ని రంగునీళ్లు ఇటు విసిరికొడితే
అవన్నీ అలుక్కుని కూడబలుక్కుని
ఓ కుడ్య వర్ణచిత్రంలా నిలబడతాయి.
శతాబ్దాల కొండగుర్తులతోనో
స్థలాల కొలమానాలతోనో
హృదయాన్ని కొలవొద్దు.
తవ్వకంతో నిమిత్తంలేదు దానికి.
ఒక్కస్పందన వీచిక చాలు
నిక్షిప్త చైతన్యనిధులు నిలువెత్తునా ఉబికొస్తాయి.

అవి సహమానవ నిశ్వాసాలను విశ్వాసాలను
అనుభూతిమాలలను ఆగ్రహజ్వాలలను
సజీవభాషలో వివరిస్తాయి.
జీవచైతన్యమంటే
అహర్నిశలు చక్రాకృతిలో తిరిగే అక్షతధారారూపం.
ప్రతీ చంక్రమణంలో మనిషిలో
మరికొన్ని సరికొత్త మతిమెరుపులు
సింహంజూలు పుచ్చుకుని స్వారీచేస్తూ
శిరసెగరేసుకుంటూ దిశలను చీల్చుకుపోయినట్టు.
పారే యేటిపాయలను వేలిసైగతో ఆపి
జలపత్రాల మీద శిలాశాసనాలు ముద్రించినట్టు.
మెలితిరిగే గాడ్పును క్షణకాలం స్తంభింపజేసి
బెలూన్‌లా పైకి విసిరేసినట్టు.
అనుకుంటే ఇవన్నీ అద్భుతాలే.
నగ్ననయనంతో పరికిస్తే
ఇంద్రియాలను ముదురు మత్తులో ముంచెత్తే
ఇంద్రజాల క్రీడలే.
మత్తు విరిగిన తరువాత లెంపలేసుకుంటాం.
మళ్ళీ కాసేపట్లో విస్మయ పరిష్వంగానికి లొంగిపోయి
కళ్లలో పారవశ్యం నింపుకుంటాం.
అద్భుతప్రియత్వం సృష్టికి సహజసత్వం.

మారుమూల కొండల్లో మంచుగడ్డల్లో
నిర్లిప్తంగా కనురెప్పలు తెరుచుకున్న బుడగబుడత
ధారాబాహువులు సాచి సాగిపోతున్నప్పుడు
మైదానాలకు మైదానాలే పాలోమని వెంటపడ్డప్పుడు
ఆ శిశువును కన్న గిరిహృదయం
ఆశ్చర్యంతో ఊగిపోదూ!
మట్టిలో మాటుమణిగితే పర్యవసానం మృత్యువే.
మరి విత్తు మాటేమిటి?
అది సత్తాపుంజుకుని మొలకతలతో కుమ్ముకుంటూ
నెత్తిమీది కప్పును తుత్తునకలు చేస్తూ
ఏడేడు నిలువులు ఎదిగెదిగి నిలబడుతుంది.
ముడుచుకు పడివున్న పుడమితల్లి
తన బిడ్డ ఎదుగుదలకు ముక్కున వేలేసుకుంటుంది.
దూదిపోచల్లా చెదిరిపోయే ఆవిరి
అంబరసీమలను ఆక్రమించుకుని
మేఘసామ్రాజ్యాలను స్థాపించుకోవడమేమిటి?
మంద్రంగా కదలాడినప్పుడు సారంగిరాగాలై
ఎగిరెగిరి పడిహుంకరించినప్పుడు
ఎలక్ట్రానిక్ వాద్యాల భయోత్పాత ఘోషలై
కరిమబ్బులు స్వరవైవిధ్యంతో పలుకుతూవుంటే
వాటిని రొమ్ముకు హత్తుకున్న నింగికి

రిమ్మెత్తిపోదూ!
మొన్నటి బోసితీగ ఇవాళ పువ్వైకూచుంటే
చూసే మన రెండు పెదవుల మధ్య
ఓ సన్ననిరేఖ విరబూస్తుంది.
అసలు పువ్వుపుట్టుకే ఒక వింత.
పూలతీగలు నేలను వశీకరించుకున్నది చాలక
గగనంలో చొరబారి మెరుపుతీగలై
మిరుమిట్లపూలు కురిపించడం
మరీమరీ వింత.

మడిచి చూస్తే మనిషి మెదడు పిడికెడు
తరిచి చూస్తే సముద్రమంత అగాధం
ఆకాశమంత అనూహ్యం.
ఎన్ని సజీవభావధారలను తనలో కలుపుకుంటుందో
ఎన్ని ప్రాణాంతక ప్రవృత్తుల తిమింగిలాలను
తన అడుగుపొరల్లో భద్రంగా దాచుకుంటుందో
పరవశించిందా అంతరిక్షఫాలంలో
కొత్త నక్షత్రమై మెరుస్తుంది.
కసిపుట్టిందా చీకటిపుట్టలోకి చొచ్చుకుపోయి
ఊపిరితిత్తుల్లో విషం నింపుకుని వస్తుంది.

సృష్టి ఎత్తునూ లోతునూ కొలిచే మానదండం
మానవమస్తిష్కం.
మస్తిష్కమంటే ఒత్తితే సొనకారే
గుజ్జుపదార్థం కాదు.
అమూర్తంగా ప్రభవించే అద్భుతాలోచనల
ప్రసూతినిలయం.
సహేతుక క్రియాశీలక ప్రయోగాలు
సాముగరిడీలుచేసే క్రీడాకేంద్రం.
గ్రహాలను తన కళ్లలోగిళ్లలో దించుకునే మానవమేధ
గ్రహపాటుకు లోనుకావడమేమిటి?
ఇంతకూ గ్రహాల జాతకాలు తనకు తెలియనివా?
బిర్రబిగుసుకుపోయిన వట్టి మట్టిబెడ్డలు
మిణుకుమిణుకుమనే వెలుతురుముద్దలు
తన నిత్యగతిని నిర్దేశిస్తాయా?
ప్రభాతాలు పలికించిన విస్ఫూర్తితో
నిశీథాలు కలిగించిన భయార్తితో
గుండెలో పెల్లుబికిన మంత్రాక్షరాలు
హోమధూమాలపాలై కళ్లు నులుముకోవడమేమిటి?
తన పరిస్థితి వికటించినప్పుడు తారకలేం చేస్తాయి?
అంగరఖా రంగుమారితే అతీతమహిమ వస్తుందా?
పాదుకలైనా పాదరక్షలైనా

ప్రయాణానికి తోడుపడేవే కదా.
ఉన్నచోటనే ఉండిపోతే ఒళ్లు బూదికుప్ప.
ఎగిసే రెక్కలకు తెగని తెగువ ఉంటే
వ్యోమసీమలు వాకిళ్లు తెరుచుకుని నిరీక్షిస్తాయి.
ఉన్నదంతా ఇక్కడే.
పతనమైనా ఉత్థానమైనా
పిడికిట్లో ఇమిడిపోయే ఈ పిండంలోనే.
పరాశ్రయమతులే గ్రహచార ప్రలుబ్ధులు.
స్వచ్ఛందగతులే స్వశక్తిప్రచోదితులు.
ఆ మనసుకంటికే పొరలుకమ్మితే
సూర్యుడు బాతుగుడ్డులా ఉంటాడు.
చితికిన ఆ గుడ్డులోంచి కారిన సొనలా
జిగటు జిగటుగా ఉంటుంది ఒంటిమీదపడ్డ ఎండ.
నేలమీద వేళ్లనాటుకుని ఎగిసే జ్వాల
ఊగిపోయే ఉన్మాది మస్తకంలా ఉంటుంది.
పసివాళ్లపాదాలు సుతిమెత్తగా కదులుతూంటే
క్రిములు పాకుతున్నట్టనిపిస్తుంది.
ముఖాలను ముద్రించే అద్దంలో
వికృతరూపఖండాలు ఒళ్లు విరుచుకుంటాయి.
ఆ పొరలున్నంత సేపూ అంతే
ప్రతి సన్నివేశం పరమవాస్తవాల వైకల్యం.

పరిశుభ్ర కిరణంలా సారించే చూపుంటే
ప్రకృతి నిత్యవర్ధని.
అట్టడుగు మట్టిలో అణిగివున్న బీజం
సస్యగర్భిణి.
గాలిసోకితే ఏ ఊపిరో పలకరించినట్టు
చినుకుల స్వరాలు శ్రుతిచేసుకునే
నీలిమబ్బుతీగ చల్లని కబురుపంపినట్టు
చిత్రానుభూతి కలుగుతుంది.
నిక్కపొడిచే కాలంజూలును చేతిలో బిగించి
వర్తమానంమీద చేసే స్వారీ
అగమ్యభవితవ్యంలోకి వేసిన రహదారి.
అడుగుల తాళ్లతో బలంగా లాగితే తప్ప
బిగుసుకునివున్న శిఖరాలు ఒడిలోకి రావు.
సడలని పిడికిలిలాంటి సంకల్పముంటే
అది నడినెత్తిన కురిసే పిడుగులను
దూదిపోచల్లా ఊదేస్తుంది.
మగతలో నురగలెత్తే మాటల్లో వినిపించేవి
ఊబిలో దిగినప్పటి పలవరింతలే.
మగత ఏనాడూ ప్రగతికి శత్రువే
మనసులో చొరబడినా
మాటల్లో దిగబడినా.

అంతసులభం కాదు
అభూతకల్పనల రజతయవనికలపైన
యధార్థదృశ్యాల ప్రదర్శన.
మనోభూమిక ఆంతర్యం తెలిస్తే
వ్యోమభూముల నిగూఢ జీవరహస్యాలు
నేత్రాంచలాల మీదనిలుస్తాయి.
ఆ నైజం ఇవతలిఅంచు స్పృశించామోలేదో
అనూహ్య హఠాత్‌పరివర్తన.
క్షణం క్రితం మీగడతరకలా ఉన్న మనసు
మాయాచ్ఛాయలా మసిబారిపోతుంది.
ఎన్ని ఆదిత్యశిశువులకు లాలపోసిందో
ఎన్నెన్ని కాంతిలతలకు పాదులువేసిందో.
ఇప్పుడే ఈ అకాలభయానక నైల్యమేమిటి?
కాలాన్ని సుతిమెత్తగా దువ్వే ఆ గోళ్లలో
బాకులు పొడుచుకొచ్చాయెందుకని?
ఎంత చల్లగా ఉండేది ఆ పండుమనసు -
కన్నతల్లి కనుపాపలా.
పచ్చని చెట్లు మండుటెండలో మాడిపోతాయని
మబ్బుల గొడుగులు పట్టేది.
సెలయేటి పిల్లసెళ్లు రాళ్లకు ఒరుసుకుపోతుంటే
గిలగిలలాడిపోయి

దోసిట్లోకి తీసుకుని ఓదార్చేది.
నిత్యం వాత్సల్యం వర్షించే మనసుకు
ఏ గ్రహణం పట్టిందిప్పుడు?
కరుణ కురిసే ఆ కళ్లలో
కాలుష్యం వెర్రితలలు వేసింది.
నిండుతేజం నిష్క్రమించింది.
కుటిలాంధకారం రంగప్రవేశం చేసింది.
అక్కడ గజ్జెకట్టి ఆడుతున్నది ద్వేషమే.
వినిపిస్తున్నవి చెవుల్ని ఛిద్రం చేసే పాశవికహేషలే.
ద్వేషంగాలిసోకితే పసరాకులు నుసైపోతాయి.
జీవనదీజలాలు విషపంకిలమైపోతాయి.
చెమట తుడిచే శీతలపవనాలకు
గొంతు పిసికేసినట్టవుతుంది.
రాతినేల ఊబిలా లాగేస్తుంది.
పండువెన్నెల కాటిబూదిలా రగులుతుంది.
పగలూ రాత్రీ కడుపులోని పేగులు తెగేట్టు
కాట్లాడుకుంటాయి.
మనసుకోశంలో విషం బుసకొడితే
మానవసంబంధాలు మాత్రమే కాదు
విచ్చుకున్న నిఖిలప్రకృతీ వికలమైపోతుంది.
అమృతానికీ గరళానికీ జన్మస్థలి మనసే మరి.

మనసులో పసితనం మొలకెత్తితే
తూర్పుముంగిట్లో బాలకిరణాలు పారాడుతాయి.
వయసొచ్చిన ఆలోచనలు చిందులు వేస్తుంటే
మధ్యాహ్నతాపం రెపరెపలాడిపోతుంది.
అలిసిన అడుగులు పడమటిమంచం మీద వాలిపోతే
మలిసందెలా వార్ధక్యంతెరపడుతుంది.
ప్రాయానికీ మనసుకూ ఉన్న రక్తజాత సంబంధమది.
మనసుకూ ప్రకృతికీ ఉన్న సహజ పరిణామక్రమమది.
ద్వేషం ఎప్పుడు ఎలా పుట్టినా
ఎన్ని బహురూప ధూర్తకృత్యాలకు ఒడిగట్టినా
కడకు దాని కసితీరేది
తాను పుట్టిన మనసును దగ్ధంచేసినప్పుడే.
మాతృహంతకి సుమా ద్వేషం
మనసా జాగ్రత్త!
ఎంత అప్రమత్తంగా వుంటున్నా
ఎదుగుదలకు దోహదంచేసే నీటిపక్కనే
విషక్రిమి వుంటుంది.
జీవకళను పెంచే ప్రవృత్తినంటుకునే
హత్యారుచులు మరిగిన కత్తి వుంటుంది.
అసలు ఆ కత్తి ఉన్నదే నిండు పొదుగును చీల్చడానికి.
పితికితే పాలు రావడమేమిటి

రక్తం చిందాలంటుందది.
పాపల పెదవులపైన పసినవ్వులొలికితే
కత్తికి ఒళ్లు మండుతుంది.
చెట్టు ఎంత ఎత్తు పెరిగినా సరే
స్తంభంలా నిలబడివుండాలి.
రెమ్మలు కనురెప్పలార్చినా
కొమ్మలు కాస్త కురులారబోసినా
కత్తి కస్సున దిగుతుంది.
లేగదూడలు పచ్చిక ముట్టొద్దు
కంపుగొట్టే కళేబరాలను పీక్కుతినాలి.
అంబా అనే పిలుపు వింటే కత్తికి కడుపు మంట-
కొంపతీసి గోవుగుండె చేపుతుందో అని.
తాను ఒరలో పడుకున్నంతసేపు
లోకమంతా చీకట్లో చచ్చినట్టు పడివుండాలి.
అంత నిర్భయంగా పాడుస్తుందే ఆ పొద్దు?
హత్య చేయాలనిపిస్తుంది కత్తికి.
బొమికల కుప్పల్లోంచి పసరుమొక్కలు తొంగిచూసినా
కమురువాసనలను పక్కకు తోసుకుంటూ
కమ్మని వాసనలు అడుగేసినా
కత్తికి తలపోటొస్తుంది.
హోరెత్తి కుమ్ముకొచ్చే సముద్రం

ఒడ్డును తాకగానే
తెల్లని నురగలా మారిపోతుందే.
నెత్తురుమడుగై పోదేమిటి?
కత్తికేంతెలుసు ఆ కలయిక తీపి.
తీరాన్ని స్పృశిస్తే చాలు కెరటాలకు
కొత్తజన్మ ఎత్తినట్టుగా వుంటుంది.
మట్టిగొంతుకలోని మూల్గులు వినిపిస్తే
వినువీధిలో ఊరేగే మబ్బుకన్ను చెమరిస్తుంది.
క్షణంలో అదినేలకు దిగొచ్చి
చినుకులచేతులతో మట్టిని ఓదారుస్తుంది.
కత్తి దారే వేరు.
పక్కనున్న ప్రాణి కదిలినట్టు అనిపిస్తే
ముక్కలు ముక్కలుగా తరిగేయాలని చూస్తుంది.
అక్కడే వుంది తేడా –
నరికే కరుకుకత్తికీ పెరిగే జీవశక్తికీ.
మారణతత్వం ఒంటపడితే
పరమ సాధుమూర్తుల నాడుల్లో
విధ్వంసక విషవీచికలు అకాలంగా వికటిస్తాయి.
ప్రకృతిగర్భంలో వికృతివిచలనం మొదలవుతుంది.
నమ్ముకున్న జీవనదాయకులే
అకాల మృత్యుకారకులవుతారు.

జననంతోపాటే మృత్యువు పుడుతుంది.
కన్నువాల్చని సాక్షిగా అది
జన్మగతిని అనుక్షణం గమనిస్తుంటుంది.
అగుపించని నీడలా వెంటాడుతుంటుంది.
మనిషికి కలిగే ప్రతి ఘోరపరాజయంలో
తానున్నానని తట్టి చెబుతుంది.
మింగలేని ఈ కటిక నిజం మానవమేధకు తెలుసు.
అది చరమసత్యమని తెలిసినా అట్టే శిరసూగదు.
పంచేంద్రియాలను పగ్గంలా బిగబట్టి నడిపే
తనకు అవరోధమేమిటి?
అహంకృతి తలకెక్కి హుంకరిస్తాడు మనిషి
ఆ హుంకారంలో మరణంఅలికిడి వినిపించదు.
తాను సాగుతున్నది తిరుగులేని రహదారి.
తన ప్రయాణం సృష్టిరహస్య స్థావరాల్లోకి.
ప్రమాదాలుంటే మాత్రం నివారణోపాయాలు లేవూ?
తగిలిన గాయాలను మాయంచేసే
ఔషధాల అమృతస్పర్శలు లేవూ?
ఏదీ ఆ మృత్యువు ఎక్కడ  చచ్చింది
ఎప్పటికప్పుడు పిరికిపందలా తప్పించుకుపోతుంది.

ఎదురుపడనీ దవడలు చీల్చి దాటిపోతాను.
ధూమంలా జడలెగరేసిన అహాన్ని తోసుకుని
నగ్నయధార్థం ముందుకురికొస్తుంది.
తోలుకళ్లలో మూతపడ్డ చూపు
పదును సూదిఅంచులా బయటికొస్తుంది.
ఇక్కడున్న పచ్చని వృక్షం ఏమయినట్టు?
ఆ కుదుట్లో శవంలా నిల్చున్న మోడుందేమిటి?
అదినేను రోజూ ఈతకొట్టిన చెరువు.
ఇప్పుడక్కడ ఇసుకదిబ్బ మూల్గుతున్న దేమిటి?
మైదానాల్లో ఒత్తయిన గరికగుత్తులు లేవు
చెదిరిపడ్డ అస్థిపంజరాలు తప్ప.
ఇవన్నీ చావుగుర్తులా.
పగ్గంబిగువు తగ్గిపోతున్నది.
రాదారి ఇరుకులోయలా జడిపిస్తున్నది.
జారీచేసిన శాసనాలను ఇంద్రియాలు ఉల్లంఘిస్తున్నాయి.
బిగించిన నరాలు సళ్లిపోతున్నాయి.
శరీరం మాంసంముద్దలా చతికిలబడింది.
శ్వాసకు ముడులు పడినట్టయింది.
వణుకుతున్న చేత్తో తుడుచుకున్న చెమటలో
మృత్యువనే మూడక్షరాలు పకపక నవ్వాయి.
గొంతుమీది కొచ్చిందా ప్రాణాంతక దశ.

కెవ్వున వేసిన కేకతో మనిషిమేధ ఉలికిపడింది.
కొమ్ము విసిరిన అహంభావం కుప్పకూలింది.
జీవితానికి నిత్యసహచరి మృత్యువనే
చిరంతన యథార్థాన్ని నెమరువేసుకుంది.
గతిశీలానికి ఇచ్చే సరికొత్తఊత అవుతుంది
ఆ నెమరువేత.
ఉత్కటించిన మనో మథనంలో రెక్క విప్పుతుంది
వినూతన సచేతన సత్యదీప్తి.
ఆ దీప్తి ఘోషిస్తుంది సముజ్వల స్వరంతో
మనిషి చావడని.
ఔను.
అవయవాలు చస్తాయిగానీ ఆలోచనలు చావవు.
శరీరం చివికి మట్టిలో కలిసిపోతుంది
గుర్తు పట్టలేకుండా.
ఆశయాలు జీవించే వుంటాయి
కాలఫలకం మీద చెక్కిన సంచలనాక్షరాలై.
మనిషే చస్తే
వెదురుపొదల్లో జన్మయెత్తిన
వేణువులేమైపోతాయి.
ఇనుపతీగల్లో నాదాలను పూయించుకున్న
వీణలగతి యేంకాను?

రాగరూపాలన్నీ ఉరిపోసుకుని చచ్చిపోవూ ?
రంగురంగుల్లో ఆకృతులు దిద్దుకున్న చిత్రాలు
నీరునీరైపోవూ?
విగ్రహాల్లో జీవిస్తున్న శిల్పాలు
కళేబరాలై కుప్పకూలిపోవూ?
పిచ్చెక్కిపోయిన తుఫాను
తరుకంఠాలను నిర్దాక్షిణ్యంగా విరిచేస్తే
పశుత్వం ఆవేశించిన వరద
ఊళ్లకు ఊళ్లే పెళ్లగించి పారేస్తే
చేలు నశిస్తాయి పొలాలు నశిస్తాయి.
పైరుపచ్చలకు ప్రాణంపోసే
అసంఖ్యాక మానవసముదాయాలూ నశిస్తాయి.
ఆ వినాశం శాశ్వతమా?
నెర్రెలుపడ్డ పుడమిఒంటినిండా
కుట్లు పడకుండావుంటాయా.
పూడుకుపోయిన గాయాల్లోంచి
కొత్తఆశ శ్వాస చేదుకోదా?
కర్రు కదులుతుంది.
కర్రును అదుముకునే నాగలి నడుస్తుంది.
నడిచే ప్రతినాగలీ మనిషే మరి.
సేద్యం చావదు.

మనిషినాడుల్లో పలికే భవితవ్యం చావదు.
ఎన్ని జలప్రళయాలు రాలేదు.
ఎన్ని భయావహ భూగర్భవిలయాలు
ప్రాణికోటిని పొట్టన పెట్టుకోలేదు.
విశ్వపటం నుంచి ఎప్పుడైనా
మనిషి తుడుచుకుపోయాడా?
విరాట్టులా పెరుగుతూనే వున్నాడు.
అహంకరించిన పర్వతశిఖరాల కుదుళ్లు
నేలమట్టంగా తెగిపోతుంటే చూశాడు.
స్వాభిమాననిర్భరంగా సాగే జీవనిర్ఝరులు
పక్క మార్చుకోవడం పరికిస్తూనే వున్నాడు.
తన వీక్షణం ఏకాంతజనితమైనా
తన పరిధి సమస్యావిచలితమైనా
బెంబేలుపడిపోయి లక్ష్యసన్యాసం చేయడు మనిషి.
ఏ సహకారనిరాకరణం జరిగినా
అనూహ్యమైన ఏ విపరిణామం తనపైకి ఒరిగినా
మనిషి అస్తిత్వం ముడుచుకుపోదు.
ఒక్కనది వెనక్కి తిరిగిపోతే
సముద్రం ఇంకిపోతుందా?
ఒక్క కొమ్మ వట్టిపోతే
చెట్టు ఎదుగుదల ఆగిపోతుందా?

మానవుడు మర్త్యుడెలా అవుతాడు?
అనశ్వరుడు నిత్య భాస్వరుడు.
ఆశయాల గొంతు పిసికి పాతిపెట్టినా
అనాహతచేతన పరిభ్రమిస్తుంది చక్రాకృతిలో.
ఝంఝల ఝంజలు వాయిస్తూ ఉద్గమిస్తుంటుంది
హోరెత్తే ఆ ఉన్మత్తనిరసన.
మృత్యువుకాట్లు పడని అశరీరతత్త్వమది.
తప్పిపోయిన చెట్లను వెతుక్కుంటూ
వేళ్లు వెళుతున్న దృశ్యమది.
అకారాదిగా ఉండదు ఆ అన్వేషణ.
నత్తగుల్లల గుంతకళ్లతో మొదలై
ముత్యపుచిప్పల ముగ్ధవిలోకనందాకా సాగుతుంది.
చినుకులతోపాటు ఇసుక కురిసిన
మిశ్రానుభూతి కలుగుతుంది నేల ఒంటికి.
రక్తంతో శ్రుతికలిపి పారిన క్షణాలు వేరు.
అప్పుడు ఏ బొమికలూ అడ్డు తగల్లేదు.
వెదురుపొదల చెలమల్లోంచి ఉప్పొంగిపారలే
స్వచ్ఛందపవనంలాంటి స్త్వైరయానమది.
చచ్చిపడ్డ ఆకులకూ చలనతృష్ణ పోదు.
ఏ మాత్రం ఊర్పు అలికిడైనా
ఎగిరి దూకాలని చూస్తాయి.

శవానికి మాత్రం సమాధి గుహలో
పడివుండాలని వుంటుందా.
సందు దొరికితే కనురెప్పలు టపటపకొట్టుకుంటూ
బయటపడాలనుకుంటుంది.
మృగతృష్ణల జిలుగుతెరలు కరిగిపోతుంటే
దాహానికి కొత్తనాలుకలు పుడుతుంటాయి.
రుచుల మూలాలు అందినట్టే అనిపించినా
తపనఅంచుకు తడి తగలదు.
ఎడారిలో తేలిపోతున్నట్టున్నా
ఎంతకూ సారంగం దాటిపోవు అడుగులు.
కారునీడలూ వెలుగువాడలూ కలిసి
ఆడుకునే అద్వైతఖేలలో
ఏ చెంగు ఎవరిచేతికో
ఏ ప్రాణశిఖ ఏ శూన్య మూర్ధన్యవాటికో.
ఉత్క్రమించిన దిశ ఏదైనా
అది వెనక్కి తిరిగి చూడని పురోదశ.
చలనశీలమున్న ఏ ప్రాణికీ జడస్థితి వుండదు.
ఎంత కదిలితే అంతగా కొత్తలోకాల అంచులు
కొనవేళ్లకు తగులుతాయి.
ప్రాణినే కాదు గాలినీ నీటినీ
సహజాత సంచలనగుణం నడిపిస్తుంది.

ఏటికూన తొలిఅడుగులో మొదలైన ఘటన
అదుపు తప్పిన సన్నివేశాల తొక్కిడితో
వెయ్యికాళ్ల వెల్లువవుతుంది.
స్వగతాల ఆత్మహత్యలు ప్రతినిత్యం పెరుగుతాయి.
చెప్పుకుందామంటే ఎదటవున్న చెవులు
సీళ్లు వేసిన సంచుల్లా వేలాడుతాయి.
రొమ్ము చీల్చి చూపిద్దామంటే
సాక్షుల్లాంటి కళ్లు మిడతల్లా ఎగిరిపోతాయి.
వేసిన అడుగు వెనక్కి తీసుకుందామంటే
మృగంలా పొంచున్న అగాధం బెదిరిస్తుంది.
వలయాల ఊబిలో నిశ్చలంగా నిల్చునేదెలా?
పట్టుకుందామంటే చుట్టూవున్న గట్టు
ఈకలు ఈకలుగా విడిపోతుంది.
పెంపుడు కుక్కల్లాంటి మాటల్ని దువ్వబోతే
మీదపడి కరుస్తాయి.
దిక్కుతోచక అరుస్తూ కన్నుతెరిస్తే
శూన్యం వెక్కిరిస్తుంది.
మరి గూడలు తెగిన చెప్పుతో
నడక ఎలా సాగుతుంది?
కల్లోలాన్ని గుప్పిళ్లతో వెదజల్లాలి గానీ
దుప్పటిలా కప్పుకోవద్దు.

మనం చూస్తుండగానే పొద్దు ఊపందుకుంటుంది.
తన వెంట ఎవరి పాదముద్రలున్నాయో
తిరిగి చూసుకుంటుందా?
సృష్టినోట పెల్లుబికిన నగ్న రోదన
ఇంకా ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది.
ఎన్ని ముసుగులు కప్పినా మరుగుపడదు.
సముద్రం పక్కన నిలబడితే తెలుస్తుంది
పిసికి పారేసిన పసిరొదలెన్నో.
తెల్లగా పొలిపోయిన నెత్తుటిమరకలే
మనకాళ్లకు తగిలే ఆ నురగలు.
ఎండపొడ వాటిని తుడిచేస్తుంది.
మరి మనసుమాటున మిగిలిన మరకల మాటేమిటి?
ఎలా కప్పిపుచ్చుకుంటారో ముడతలను.
పదిలంగా మడిచిన చిరునవ్వు మెరుస్తుంటుంది
సుఖమంతా ఆ ముఖంలోనే విడిది చేస్తున్నట్టు.
కొన్ని నటనలు సహజంగా పుష్పిస్తాయి.
మరికొన్ని పెదవుల కుండీల్లో అమర్చిన
కృత్రిమ కుసుమహాసాల్లా ఉంటాయి.
కథ నడుస్తూనే వుంటుంది గుంభనంగా.
కట్టుకున్న కాషాయమల్లా స్వచ్ఛసన్యాసమవుతుందా?
ఓయ్ అది ఎప్పుడో వెలిసిపోయిన బట్ట.

ఇప్పుడున్నది దట్టంగా పులిమినరంగు.
ఏమో ఏ బట్టలో ఏ దివ్యపాత్ర వుందో?
ముగ్ధచిత్తం మునకలు వేస్తూనే వుంటుంది.
భ్రమావరణంలోంచి బయటపడటానికి
ఎంతోకాలం పట్టదు.
మెదడును చరిచే హేతు ఝంఝాధాటికి
పిచ్చినమ్మకాల పొగలపొరలు విచ్చుకుపోతాయి.
ఇప్పటిదా ఈ మలుపు?
అది బతుకుకథ తలపైన
ఎప్పటికప్పుడు మెరిసే సరికొత్త కొసమెరుపు.
ఎందుకొచ్చిన కంచెలివి?
ఇది పారిపోయే చేనుకాదు.
ఒంట్లో మరింత కండ నిండాలి.
హృదయం ఇంకా ఇంకా పండాలి.
ఆ ప్రతీక్ష అందుకే.
ఈ మొక్కలు నిలబడ్డ సెగల్లా కనిపిస్తాయి
ఏ పక్షీ వాలదిక్కడ.
ఎవరూ కోసుకుపోరు దీన్ని.
మాడును ఎండ పగలగొడుతూవున్నా
సమస్తదేహాన్ని చలి మెలిపెడుతూవున్నా
భూమిపేగును తెంచుకుని పొదు చేను.

కంచెకేంతెలుసు చేను చరమలక్ష్యం?
పైరు తన ప్రాణాలను అర్పించుకునేది
వేల ప్రాణాలను నిలపడానికే.
కొన్ని కంచెలు ఎవరో నాటినవి
మరికొన్ని మనమే నాటుకున్నవి.
ఆలూచూలూ లేని కృత్రిమ పిండాల్లాంటి బోధలైతే
నేరుగా ధిక్కరించేవే.
నీతికి కాపలాకాసే హేతునిశిత సూత్రాలైతే
ఎదతెరిచి స్వీకరించేవే.
అసలు కంచెలు నాటేదెందుకు?
మదించిన ఏ పసరమో వచ్చి పైరును మేసిపోతుందనా
ఎదిగిన చేను ఎక్కడికైనా లేచిపోతుందనా.
మానవ జీవనక్షేత్రంలో నాటిన కంచెలు
నైతికవర్తనపై విధించిన ఆంక్షలు.
అహంతకు ప్రాకారాలుగా కట్టుకున్న ఆంక్షలు మాత్రం
ఎంతో కాలం నిలవవు.
సాగినన్నాళ్లు రాజమార్గంలో పరిక్రమించే
రథచక్రాల్లా సాగిపోతాయి.
ఆగిపోవడం మొదలైతే అడుసులో దిగబడ్డ
ఎడ్లబండ్లలా ఆగిపోతాయి.
"అదిగో ఆపండు తినకు - తింటే పాపం."

అది తీవ్ర దివ్యస్వరం.
దాన్ని ధిక్కరించిన ఆదిమానవుడు
ఆత్మజ్ఞుడే కాదు విశ్వజ్ఞుడయ్యాడు.
"ఇదిగో ఈ నీళ్లు అంటుకోరాదు - అంటుకుంటే నేరం".
అది కఠోర వర్ణదుశ్శాసనం.
ఆ ఆంక్షను ప్రతిఘటించిన అస్పృశ్యుడు
అభినవ శాసనకర్త అయ్యాడు.
కంచెపైనుంచి ఎగిరొచ్చిన పిట్టలను
వడిసెలగుండ్లతో ఎగరగొడతారు.
కంచెను తెంచుకుని చొరబడ్డ పశువులను
బందెలదొడ్డిలో తోసి పడేస్తారు.
నీతిని నేలమట్టం చేసి
అల్పప్రాణుల మూపులపైకి ఎక్కేసి మెడలు రిక్కించే
నరమృగాల దురంతాల మాటేమిటి మరి?
రాత్రికిరాత్రే ముక్కలు ముక్కలుగా నరుక్కొచ్చిన
పచ్చని చెట్ల అవయవాలతో
పట్టపగలే ఎత్తు మేడలను నిర్మిస్తుంటే
ఇవి ప్రకృతి జనయిత్రి పక్కయెముకలురా అని
గద్దించే చట్టాలెక్కడ దాక్కున్నాయి?
చేజిక్కిన ముడుపుల మడతల్లోనా
అగ్రాసనాల చూపుడువేళ్ల నీడల్లోనా?

కంచె బిగించేది చేనుకని
ఆంక్ష విధించేది మనిషికని
అందరికీ తెలిసిందే.
ఉన్న చిక్కల్లా
కాపుగా నిలిచే కంచెలు వంచనలకు మరిగి
పచ్చని చేలను కబళించినప్పుడు.
నిప్పల్లా ఉండాల్సిన ఆంక్షలు రంగులు మార్చి
అవకాశవాదాల ఊసరవెల్లులైనప్పుడు.

కాలానికి రెండో పక్క చీకటి.
ప్రకృతిలో రెక్కవిప్పే సహజపరివర్తనను
గుప్తలిపిలో రాసుకున్నపుట చీకటి.
కాలంమూలం తెలిసిన మానవనేత్రానికి
చీకటంటే ఉలికిపాటెందుకు?
అది పాములా కాటేయదు.
నిప్పులా కాల్చేయదు.
తుఫానులా బడుగుగుడిసెలనూ అడుగుమనుషులనూ
ఎగరేసుకు పోదు.
విహారయాత్రకువెళ్లే చంద్రుణ్ని అవరోధించదు.
సూర్యుడిమీద కుట్రపన్ని దొంగదాడి చేయదు.

తన పరిధిలో తాను పడివుంటుంది.
ఆకాశాన్ని అంటుకుని అనాధల్లా వుండే చుక్కలు
చీకటిపుణ్యం వల్లనే వెలుగు చూసేది.
ఇంటికప్పు ఒంటికప్పు నోచుకోని నిర్భాగ్యులకు
అది తన ఒడిలో చోటిస్తుంది.
పగటిరాపిడికి కాకపుట్టిన దేహాలకు
చలువమందు పూస్తుంది.
నసేమీ రానని మొండికేసే నిద్రను బుజ్జగించి
కళ్ల పొదరిళ్లలోకి రప్పిస్తుంది.
ఋతువులు రంగులు మార్చినా తనది సమదర్శనం.
వేసవిలో వడగాడ్పులా ధుమధుమలాడదు.
చలిలా నరాలను జువ్వన లాగేయదు.
మేఘం ఎదురుకాగానే వంగి దండంపెట్టి
అది చెదిరిపోగానే మీసం మెలిపెట్టి
తన ప్రభ వెలిగించే ఇనబింబంలాంటిది కాదు.
తనకు చేతకానిది అవకాశవాదం.
సర్వవర్ణాల సారూప్యం తానున్నప్పుడే.
తాను ఏతప్పు చేసిందని
చీకటి తప్పు పేరుతో దెప్పుతుంటారు.
పట్టపగలు ఎన్నిఘోరాలు జరగవు.
ఎన్నెన్ని ఖరీదైన పాపాలు దిగంబరంగా క్రీడించవు.

చేతిలో అధికారం బుసకొట్టేవాళ్లకు
చీకటిమాటు కావాలా?
నడిబజారులో జనసమక్షంలో నల్లధనం కొల్లగొట్టే
వంచనావ్యాపార పారంగతులకు
చీకటిబజారంటూ అఖ్కర్లేదు.
విశాలవిశ్వమే వాళ్ల అక్రమవాణిజ్యవిపణి.
చీకటి ఆవేదన మనసు చెవికెక్కింది.
దోషి చీకటికాదు తానే అని
మనసుకు తెలిసిపోయింది.
కాలం పక్కలోకి ఒదిగిన చీకటిని లాక్కుని
తనలోకి ఎక్కించుకోవడమే మనసు చేసిన తప్పు.
కమ్ముకున్న ఆ మసకలోనే కదా
కామం నిలువెల్లా పడగలెత్తింది.
కప్పుకున్న బిరుదుల బురఖాలను
తెచ్చుకున్న కీర్తిభుజకీర్తులను జారవిడిచి
తాను అర్ధనగ్నంగా నడిచింది.
ఏయవనిక వాలితే కాంతిరంగస్థలాన్ని
జటిలాంధకారం ఆక్రమిస్తుంది?
ఏ ఎల్ల దాటిపోతే ఇలామండలంలో
పూతవెలుతురు పురులువిప్పుకుంటుంది?
ఏ చెట్టయినా జన్మయెత్తింది

పొదిగిన విత్తు కడుపులోంచే.
మరి చెట్లనూ గుట్టలనూ మోస్తున్న
ధరిత్రినికన్న కడుపేదీ?
ఆవిరై లేచిన కడలినీరే
అశరీరక్షేత్రంలో మేఘాలకు నారుపోసిందా?
మబ్బులు నాటిన జలబీజాలతోనే
సముద్రం ఆవిర్భవించిందా?
ఈ నిశితప్రశ్నల నిరవధికచంక్రమణకు
ఏది సమాధానం?
స్థలకాలాల అనుసంధాతగా ఎదిగిన మనిషికి
అనూహ్యమధనం మొదలవుతుంది.
గర్భకోశంలో జన్మించినా
గాజుపాత్రలో ఉద్భవించినా
తన ఉత్పత్తికి మూలం వీర్యకణబీజం.
తాను ఎలా పెరిగిందీ
ఎన్నెన్ని ఇంద్రియలౌల్యాల ఎండమావుల్లో తిరిగిందీ
తనను తొక్కేసే దుఃఖాలను ఎలా మోసిందీ
కమ్ముకునే సమస్యల దుర్గమారణ్యాలను చీలుస్తూ
గమ్యంవైపు తన పాదాలను ఎలా విసిరేసిందీ
స్మృతుల అద్దాల్లో నిత్యం చూసుకుంటున్నాడు మనిషి.
తాను నిలిచిన ధరణీగోళానికీ

తాను దర్శించిన జలధి అంతరాళానికీ
తన రెక్కలగాడ్పులు స్పృశించిన గ్రహజాలానికీ
మౌలిక సృజనకణాలెక్కడివి?
శ్వాస ఆడితేనేకదా శరీరం నిలిచేది.
వెలుగులో ఉంటేనేకదా వస్తురూపం తెలిసేది.
చెమటచుక్కలు రాతిమీద పుట్టవు
ఒంటిమీదే.
కారణమనే పునాదిపైనే కార్యాంగం రూపుకడుతుంది.
తన అనుభవపటం మీద ముద్రించిన
ప్రత్యక్షర సత్యమది.
మహానదుల విశృంఖలగతులను మళ్లించిన తాను
అనంతజలరాశులను చట్రాల్లో బిగించిన తాను
ఊహకందని అంతరిక్షనిక్షిప్త విశేషాలను
మూరెడు తెరమీదికెక్కించిన తాను
అసలు రహస్యం అంతుపట్టలేక
కళపెళ కాగిపోతున్నాడెందుకని?
"జగత్సృష్టి కారకుడైన ఆ బీజ ప్రదాత యేడీ?
ఏడీ కనిపించడే?
ఎక్కడున్నాడు బదులివ్వడే?"
ఉవ్వెత్తుగా ఎగిసే ఉద్వేగంతో
మాడుపగిలేట్టు అరిచాడు మనిషి.

తన ఉద్రిక్తస్వరమే తనకు వినిపించింది
శ్రవణపుటాలను వెక్కిరిస్తూ.
అప్పుడుగానీ తెలియలేదు మనిషికి
తనలో జరుగుతున్నది కేవల వాయుమథనమని.
ఏ ఫలితం వెలికిరాని వృథాకదనమని.
అలిసిపోయిన ఆలోచన నిద్రాముద్రలో ఉన్నప్పుడు
అదృశ్యవాణి వినిపించింది మనిషికి
విశాలగుహాంతరంలోని ప్రతిధ్వనిలా.
"ఆదిశక్తిని నేనే.
అవ్యక్తమూర్తిని నేనే.
సకలసృష్టికి బీజప్రదాతను నేనే.
చరాచర స్థితిలయనిర్ణేతను నేనే.
నీలోని ఆత్మధాతువు నేనే.
జీవకోటి జననమరణసేతువు నేనే."
ఉలికిపడి చుట్టూ చూశాడు మనిషి.
ఎవరూ లేరు
వాయుతంత్రులపైన ధ్వనించే ఆ వాక్యాలు తప్ప.
అశరీరస్వరం మారుమోగుతూవుంటే
ఆలోచనాధారకు మళ్లీ పదునెక్కింది.
అంతఃకల్లోలం సుడులు సుడులుగా తిరిగింది.
ప్రశ్నల విస్ఫులింగాలు పటపట ఒళ్లు విరుచుకున్నాయి.

"అరూపశక్తికి నోరుంటుందా?
గాలిలో వేలాడే చెట్టువేరుంటుందా?
ఈ సృష్టి ఎవరో నడిపే ఇంద్రజాలమా?
పాంచభౌతికదృష్టి భ్రాంతిమూలమా?
తనువులోని అణువణువూ తనకు తెలుసు.
మనసుపొరల్లో దాగిన మర్మాలు తెలుసు.
అక్కడెక్కడా ఆత్మ కనపడలేదే.
ప్రాణాల దుస్తులు ధరించి అది
ప్రచ్ఛన్నంగా సంచరిస్తుంటుందా?
హోరెత్తే ప్రశ్నలకు నోరెత్తే జాడ కనిపించలేదు.
అతిలోకశక్తికూడా కునుకు తీస్తున్నదేమో?
మరోసారి పిచ్చిగా అరిచేస్తే ఆ శక్తికి నిద్రాభంగం.
తనది ప్రశాంతిఘాతుక వృత్తికాదు.
నిశితప్రశ్నలు ఎక్కుపెట్టే ప్రవృత్తి.
అలా తనలోతానే తర్కించుకుంటూ
కళ్లనిండా చల్లని నిద్రను కప్పుకున్నాడు మనిషి.
మానవమస్తిష్కంలోని ఈ మథనగుణం
భూమికీ గ్రహాలకూ నైసర్గికలక్షణం.
గ్రహాల చంక్రమణాన్ని అహోరాత్రాలు గమనిస్తూ
యుగాలు జాలిగా నిట్టూరుస్తాయి.
క్షణం విశ్రాంతిలేని ఈ తిరుగుడు ఎన్నాళ్లని?

ఊర్ధ్వముఖంగా విసురుగా దూసుకుపోతే
అబరం అవతలిఅంచు అందేదేమో!
వినూతన రోదసి అవ్యక్తస్పర్శ లభించేదేమో!
అగణిత హరితనిధులను
అపార పారావారాలను
తనువునిండా కోకొల్లలుగా పరుచుకున్న ధరణి
అనాధలా తన చుట్టూ తానే తిరగడమేమిటి?
ఏ దిక్కూలేనట్టు బిక్కుబిక్కుమంటూ
భగభగమండే అగ్నిగోళం చుట్టూ భ్రమించడమేమిటి?
స్థలకాలాల విచిత్రవలయంలోనే
ఈ చంక్రమణ దౌర్బల్యముందో ఏమో?
ఆ వాసనే అప్పుడప్పుడు మనిషికీ అంటుకుంటుందేమో.
మట్టి గర్భకోశంలో మెత్తగా మొలకెత్తి
గాలిచెక్కిళ్లను మునివేళ్లతో నిమురుతూ రెక్కలెత్తి
గగనంతో కరచాలనంచేసే మనిషికి
ఆ భ్రమణ గుణమేమిటి?
గ్రహాలను ముడివేయాలని చూసే విశ్వమర్మజ్ఞునికి
లక్ష్యరహితంగా జరిపే ప్రదర్శనమేమిటి?
ఆత్మచంక్రమణం ఒంటికెక్కిన మనిషిమతి
అన్యసీమల్లోకి చొచ్చుకుపోతుంది.
నిలువెత్తుగా నిక్కికూర్చున్న ఆసనాలకు జేజేలుకొడుతూ

ఆ విస్మృతమతి ప్రదక్షిణలు చేస్తుంది.
కళ్లు జిగేలనే ధనరాసులచుట్టూ
పొర్లుదండాలు పెడుతుంది.
అక్కడ వేరుతన్నుకుని జడలు సవరించుకునే
కుటిల మంత్రాంగాలే వేరు.
సందు చూసుకుని మతమౌఢ్యం
శవాలధ్వజాలెత్తి ఊరేగుతుంటుంది.
పురులు తెగిపోయిందనుకున్న కుల సంకులదృష్టి
సరికొత్త వలలు పన్నుతుంటుంది.
ఉబ్బిపోయిన డబ్బురుబ్బురాయికింద
బక్కచిక్కిన నైతికవ్యవస్థ పచ్చడవుతుంటుంది.
తడిమి చూసుకుంటే తెలుస్తుంది మనిషికి
తాను పరిభ్రమిస్తున్నది ఈతకొలను కాదు
రొచ్చుగుంట అని.
తాను పీలుస్తున్నది నీటిగాలికాదు
అవినీతి కంపుకొడుతున్న నోటిగాలి అని.
తిరుగుడుకు స్వస్తిచెప్పి శిరసు విదిలించుకుంటాడప్పుడు.
మనిషిలక్ష్యం నిరర్థకపరిభ్రమణం కాదు
ఈడ్చిఈడ్చికొట్టే సుడిగాడ్పులో సాగించే
మడమతిప్పని పురోగమనం.
పరస్పర విరుద్ధ దిశాసమీకరణం.

గుండె గుండెలో రాజుకునే నిప్పుంది.
దుఃఖమేకాదు మనిషిని సుఖమూ దహించివేస్తుంది.
నిరాశేకాదు ఆశా కాల్చేస్తుంది.
దుఃఖం వేరుపురుగులా తొలిచేస్తుంటే
తుడుచుకునే కన్నీరు వేళ్లకు సెగలా తగులుతుంది.
నిట్టూర్పు విడుస్తూవుంటే
హృదయాన్ని పెకిలించి బయటికి విసిరేసినట్టపిస్తుంది.
కదలని కాలం కణకణలాడినట్టుంటుంది.
ఎటూతోచక పచార్లు చేస్తూవుంటే
ఇంటివాకిలి చురచురలాడుతుంటుది.
వీధిలోకెళితే అద్దమైనముఖం వెక్కిరిస్తూపోతుంటుంది.
కళ్లలో ఉదయకాలసమీరం
ఉడుకుపొగలు విసిరికొడుతుంటుంది.
దుఃఖదగ్ధునికి పట్టిన ఈ దురవస్థ
సుఖమగ్నునికీ తప్పదు.
తనకున్న బ్యాంక్‌ఖాతాలది అగణితవైభవం.
తన అడుగుఅలికిడి వింటేచాలు
సమున్నతాసనాలు మోకరిల్లుతాయి.
ఉన్నసుఖమంతా తనలోనే విడిదిచేసిందని

చూసేలోకానికి అసూయ.
కీర్తిఅజీర్తితో తానెలా మెలికలు తిరుగుతున్నదీ
ఎవరితో చెప్పుకోవడం.
తన పాన్పు సువిశాలంగా పరుచుకునివున్నా
మేనువాల్చే జాగా కాసిన్ని అడుగులే.
మిగిలిందంతా నిద్రపట్టక పొర్లడానికి.
ఉన్నచట్రంలో ఇమిడివుండే అర్థంకాదు సుఖం.
సుఖానుభూతి మరింతసుఖాన్ని కోరుకుంటుంది.
మరిన్ని అద్భుతాలను దూసుకు తేవాలనుకుంటుంది.
గగనాన్ని కత్తిరించితెచ్చి
గదిలో తివాసీలా పరిచేయాలనుకుంటుంది.
నగరంలోని తారురోడ్లన్నీ
తన పాదాలదగ్గరే మెలికలు తిరగాలనుకుంటుంది.
తానులేచిన తరువాతే పొద్దుపొడవాలని
తాను విశ్రమించాలనుకున్నప్పుడే
గుట్టుచప్పుడు కాకుండా చీకటిపడాలని
పైన తిరిగే ఫ్యాన్‌లా ఊహలు పరిభ్రమిస్తాయి.
ఏ.సీ. వేసుకున్నా గుండెలో ఆవిర్లులేస్తుంటాయి.
సుఖానికి కొలమానం
తినే పదార్థాల మూల్యంలో లేదు.
పడుకునే యూఫోమ్‌పరుపుల నాజూకుతనంలోలేదు.

ప్రవహించే కార్ల నిశ్శబ్దయానంలో లేదు.
అసలైన సుఖం దొరికేది నిర్వికారచిత్తంలోనే.
ఆశ అవధులు దాటితే మిగిలేది అశాంతి మాత్రమే.
సుఖదు:ఖాల తూనికరాళ్లతో
బతుకును స్తిమితంగా తూచగలిగినప్పుడే ఏర్పడుతుంది
సమతౌల్యమైనా సాఫల్యమైనా.
ఇంతకూ ఈ ద్వంద్వప్రవృత్తులు లేనిదెక్కడ?
ఈ దహనపీడనలు లేనిదెక్కడ?
కుదురుగా ఉన్నట్టు అనిపించే ధరిత్రి
గుప్తవేదనలను గుప్పిట్లో మడిచిపెట్టుకోలేక
ఆకస్మాత్తుగా సృష్టిఘాతుకంగా ప్రకంపించిపోతుంది.
ఏమైనా సర్వంసహకదా
అంతలోనే జాలివింపుకుని
అదిరిపోయిన ప్రాణులను ఒరిగిపోయిన స్థాణువులను
అదృశ్యాంగుళులతో వీపునిమిరి ఓదారుస్తుంది.
పారే నదీజలాల శీతలస్పర్శతో పరవశిస్తూనే
అవి తన తనువును కోసుకునిపోతుంటే
చిత్రహింస అనుభవిస్తుంది.
ఎవరికీ కనపడనీయకుండా
తన కన్నీళ్లను ఆ నీళ్లలోనే కలిపేస్తుంటుంది.
అరణ్యానిది అదో సుఖమయజగత్తు.

సెలయేళ్లు పసిలేళ్లలా ఉరుకుతుంటే
పట్టలేనంత పారవశ్యం.
ఆసౌఖ్యం ఎన్నాళ్లని?
అడివిఒడిలో ఏపుగా పెరిగే పచ్చదనాన్ని చూసి
కార్చిచ్చుకు కన్నెర్రబడుతుంది.
పైశాచికోన్మాదంతో ఒక్కుమ్మడిగా విరగబడి
తరుశరీరాలను దగ్ధంచేస్తుంది.
ఒక్కొక్కరెమ్మ నుసిలా రాలిపడుతుంటే
ఎంత గుండెకోత అడివితల్లికి.
ఏంచేస్తుంది పాపం.
ఎదురుగానే తన సంతానవిధ్వంసం జరుగుతూవుంటే
ఎక్కడికని ఎగిరిపోతుంది?
మసికుప్పలను పసిమిమొక్కలుగా మార్చే
రేపటి చల్లటి చేతులకోసం
వెర్రి ఆశతో ఎదురుచూస్తుంది.
పర్వతంమాత్రం ఎంతకాలం స్తబ్ధంగా వుంటుంది?
ఫెటిల్లున బద్దలైపోయి భీషణజ్వాలలు కక్కేస్తేతప్ప అది
చెరలాంటి చిరంతనజడిమ లోంచి బయటపడదు.
గంటగంటకూ దానిమ్మగింజలు తినిపించినా
చిలకకు పంజరవాసం రుచిస్తుందా?
ఇనుపచువ్వలను ఛేదించాలని ఎగిరితన్నుతుంది.

గిసినగిరిలో హాయిగా ఉండిపో అంటే
పక్షిలాగే పర్వతానికీ అసహనం పుడుతుంది.
అణిగివున్న ధరణికేకాదు
ఆకాశానికీ తప్పదు ఈ ద్వంద్వఘర్షణ.
ప్రచండభానుతాపంతో దేహం దహించుకుపోతున్నా
వెన్నెలను కప్పుకుని చుక్కలజిలుగులను అద్దుకుని
మనుగడ కొనసాగిస్తుంది.
అందుకోలేని దూరదూరాల్లో వున్నా
అందరికీ అందినట్టే ఆత్మీయత ప్రదర్శిస్తుంది.
ఇటుమట్టినీ అటు మింటినీ
అనుసంధించే సేతువులావున్న మనిషి
స్థితమతిగా రూపొందితేనే విశ్వప్రగతి.

సమూహగమనంలో పశుజాతి డెక్కల్లోంచి
ఆనందధూళి ఉదయిస్తుంది.
ఆ ధూళిమేఘాల్లో తమ ఆనవాళ్లు కోల్పోయినా
అవి ఆత్మీయతను పంచుకుంటాయి.
ఒక ఒంటిని స్పర్శిస్తూ ఎగిసేదుమ్ము
మరో ఒంటిని పరామర్శిస్తుంటే ఎంత తాదాత్మ్యమో.
ఏమిటీ ధూళి అని దులపరించుకోవవి.

శాలువాల్లా నిండాకప్పుకుని సాగిపోతుంటాయి.
కట్టుకొయ్యలకు చుట్టుకుపోయిన చీకటిబతుకు వేరు.
అది కాలు కదపనీయనిది.
నీలాంబరం కింద కలిసినడవడం
సామూహికస్వేచ్ఛకు నాంది పలకడం.
బాటకు ఇరుపక్కలా బారులుతీరిన వృక్షాలు
కదనుతొక్కే పశుగణానికి స్వాగతం పలుకుతాయి.
వేళ్లు దాటిపోలేని తమ అశక్తతను గురించి
రెమ్మలనోళ్లెత్తి విన్నవించుకుంటాయి.
పుడమిపొరలు తమ మూలాలను బిగబట్టుకోకుంటే
వృక్షాలూ సామూహికయానంలో భాగస్వాములయ్యేవి.
పశువుల్లా తమకు సంచరించే జన్మలేదే అని
అవి ఉసూరుమంటూవుంటాయి.
చెట్లకులేకున్నా అవి విడిచే నిట్టూర్పులకు
చలనముంది కదా.
చలించే ఆ ఊర్పులకు చరప్రకృతితో కలిసిపోయే
సహయానగుణమూ వుంది.
తమ శ్వాసధారల రూపంలో తరువులు
తామూ సాగిపోయే అనుభూతిని పండించుకుంటాయి.
గుంపులుగా ఎగిసిపోవడం పక్షుల జీవలక్షణం.
అవి ఏగూళ్లకు తరతరాల వారసులో

ఏ శాఖలపైన ధ్యానముద్రలోవున్న రుషులో
విప్పినరెక్కలను నిరంతరం సమగతిలో శ్రుతిచేసుకుంటాయి.
గమ్యంమీది ధ్యాస ఏమాత్రం లేదు
గమనంపైని పిపాసతప్ప.
వేటగాళ్ల కేటువాసనలను పసికట్టే
పదునుముక్కులే అవి.
బందూకులకు భయపడి అరల్లోపడివుండే
పిరికిపందలుకావు.
తమ బృందగాత్రాలెత్తి ధరిత్రి విశేషాలను
విహాయసానికి వినిపించాలని
పొద్దంతా ఆ విహంగాల సమైక్యగమనం.
సమూహమంటే మనిషికీ పుట్టుకనుంచే ఇష్టం.
తనలాంటి బాల్యంతో కూడి ఆడాలని
ఇల్లుకాదని వాకిలి వెతుక్కుంటాడు.
ఇసక కనపడితేచాలు
ఎన్నెన్ని పసిపాదాలు ఎగిరిదూకుతాయో.
మందితో కలిసి చిందులేసేటప్పటి తృప్తి
మంచంలో పడుకోమన్నప్పుడు లభించదు.
పదంపదం కలిపి
శతాధిక కంఠాల్లో ఒకే నినాదం పలికి
సమూహంగా మానవుడు సముద్గమిస్తుంటే

బాహువులనిండా నురగలెత్తేవి చైతన్యవాహినులే.
ఎన్నెన్నో బిగిసిన పిడికిళ్లను ఎక్కుపెడుతుంటే
ఇకవేరే పతాకలెందుకు?
తన అస్తిత్వాన్ని సాముదాయికంగా మలచుకున్న మానవుడు
అనుపదం సంఘజీవి.
రెక్కలు ముడుచుకుని నిర్లిప్తంగా పడుకునే
పక్షికాదు తాను.
కొయ్యకు కట్టుపడి మాగంటితో మోరవాల్చే
పశువూ కాదు.
తన పాదాలు సంఘరంగంలో తిరుగాడుతున్నా
మనసును ఏకాంతం కమ్ముకుంటుంది.
కెరటాలను వెంటపెట్టుకుని పయనించే ఝరి తానే.
లోలోతుల్లోకి తొలుచుకుపోయే ఉలి తానే.
వృక్షాల్లా సహపంక్తిలో నిల్చునివుంటూనే
పక్షుల్లా సమస్థాయిలో ఉడ్డీనంచేస్తూనే
నక్షత్రాల ఒంటరితనాన్ని అకాంక్షిస్తాడు.
పరిసరాల పరివర్తనలను కాసేపు విస్మరించి
తనలో తానే మునకలువేస్తాడు.
సృష్టికి ముందు తానెందుకు పుట్టలేదు?
ఏ అవ్యక్తహస్తం తిప్పితే ఈ జగత్తు పుట్టిందో
ఎందుకు కనిపెట్టలేదు?

మైదానం సిద్ధంచేసి 'రా' అని పిలిస్తే
మైమరిచి ఆడుకునే పసివాడా తాను.
ఆలస్యంగా పుట్టినా అన్నిటికీ అగ్రేసరుడు.
ఇక్కడే నిలదొక్కుకుని
గ్రహశరీరాల గుప్తరహస్యాలను
జాబితాల్లోకి ఎక్కిస్తున్నాడు.
అంతా పారదర్శకంగా వుంటే ఇంకా దాపరికం దేనికి?
తాను అందుకోని ఎత్తులున్నాయా?
సర్వసౌఖ్యాలూ ఊర్వశుల్లా మూర్తీభవించే
స్వర్గం అక్కడెక్కడో వుందట.
చిత్రహింసలన్నిటికీ చరమకేంద్రంగా నలిచే
నరకం ఆ పక్కపక్కనే వుందట.
అర్భకులకో మానసికదుర్బలులకో
గీసిచూపే పటాలవి.
స్వర్గాసనం ఆరోహించిన అధినేత
ఎన్నిసార్లు తలకిందులుగా పడిపోలేదు.
నరకాన్ని గుప్పిట్లో పెట్టుకున్న ఆ మృత్యుదాత
ఇరుకులోపడ్డ ఘట్టాలెన్నిలేవు?
ఎక్కడోలేవు స్వర్గనరకాలు.
తన హృదయసదనంలోని రెండుగదుల్లో వున్నాయి.
ఆ రెండు పక్కలూ వేసిన ప్రగాఢముద్రలు

తన అనుభవపుటల్లో భద్రంగా వున్నాయి.
తల బరువెక్కిన ఏకాంత మానవుడు
అంతరంగ మధనంలోంచి బయటపడి
బహిరంగరంగంలోకి ప్రవేశిస్తాడు.
బావుటాల్లా మునుముందుకు కదిలిపోయే వేల శిరస్సులతో
తన శిరస్సును జతపరుస్తాడు.
అదే అడుగు అదే పరుగు.
కలిసిపారే గళనాళాల్లో అదే కడలిహోరు.
ఏకాంత దుర్గాన్ని కప్పుకున్న మనిషి
ఒదిగివున్న ఒళ్లు విదిలించుకుని లేచి
తానే ఒక సముదాయమైపోతాడు.
సంఘర్షణలను రంగరించుకుని
ప్రతికూల కాలప్రభంజనాలను పక్కకు తోసుకుని
ప్రవాహమై సాగిపోతాడు.
ఆశల సానరాళ్లపైన పదునుపెట్టిన
చూపులు దూసుకుపోతాయి
కణంకంటిలోంచి గగనగర్భంలోకి.
ఎగిసే ఆలోచనలకు అంటుకున్నరేణువుల్లో
నక్షత్రాలు తమ ముఖాలు చూసుకుని
చెదిరిపోయిన పాపిటలనుసరిదిద్దుకుంటాయి.
సాగిపోయే రెక్కలరీళ్లకు ఎక్కడా

విశ్రాంతి అక్షరాలు ఎదురుకావు.
సముద్రంలా పరుచుకున్న నీలిమ అంచుపైన
శ్వాసల బుడగలు గాలిపడగలవుతాయి.
సహపథికులు స్తబ్ధులైపోతారు.
కుదుళ్లు తెంచుకోలేక గోళ్లు కొరుక్కుంటూ వుంటారు.
అంత సులభం కాదు వేళ్లనొదిలిపెట్టి
చెట్ల చేతులు పైకి చిమ్ముకుపోవడం.
ఉన్నచోటే వుంటే యేముంది.
అదే పులిసిపోయిన గాలి
అవే తిప్పితిప్పి తుడుచుకునే తేదీల జేబురుమాళ్లు.
గదిలోనో పుస్తకం పొదిలోనో ముడుచుకుని వుంటే
కాలం పిరికిగుడ్లు పెడుతుంది.
ఏ క్రమమొన దిగని క్షేత్రమూలాల
జీవనాళాల్లోకి చొచ్చుకునిపోయి
ఒంటినిండా సాహసరుధిరాన్ని నింపుకోవాలి.
వ్యక్తిత్వమంటే బొంగరంలా కాసేపుతిరిగి
బూదిలా చతికిలబడేదికాదు.
భూమిలా నిరంతరం పరిభ్రమించేది.
జావగారిపోయిన తోటి ప్రయాణీకులు
లేవడానికి ఊపిరి కూడగట్టుకుంటారు.
క్షణాలకు పీకలు నులిమేసినట్టుగా వుంటుంది.

గదితో సహా ఆ పాదాలను పైకి విసిరేస్తే-
అప్పుడైనా ఆ పథికుల శిరసులు పక్షులవుతాయి.
బాహువులు విచ్చురెక్కలై పలకరిస్తాయి.
సమూహయానంలో భూమ్యాకాశాలు
స్థానాలను మార్చుకుంటాయి.
పొదుగుచేపిన మట్టికి రోదసి కనిపిస్తుంది
అప్పుడే పుట్టిన శిశువులా.
నిత్యోదయశీలమే వుంటే
ప్రతినిమిషం నవ్యసృష్టికిప్రతిబింబం.

ఉదయాస్తమయాల పావులు కదిపే కాలకేళిలో
మనిషిమనసు పరోక్షసాక్షి.
ఆ సాక్షి అక్షి ఎప్పుడెలావుంటుందో తెలియదు.
ఆ సాక్ష్యం ఏ వెలుగుకు ఎసరుపెడుతుందో
అంతంతమాత్రాన అంతుపట్టదు.
తుడిచిన అద్దంలా మనసుంటే
మిణుగురు పురుగుల్లా మిలమిలలాడే చుక్కలు
సంపూర్ణశరచ్చంద్రబింబాలై సాక్షాత్కరిస్తాయి.
లోతుల్లోకి మునకలేసి చూస్తేతప్ప
అంతరాళమూలమేమిటో అంచనాకట్టలేం -

మట్టైనా, ఆకాశమైనా, మనిషైనా.
మొరటునేలను తడిమితే తగిలేవి
గరుకుగరుకు రేణువులే.
మండుటెండలు దాడిచేసిన రోజుల్లో బొబ్బలెత్తిన
మట్టి వీపులే.
అన్ని వైపరీత్యాలనూ భరిస్తుంది ధరిత్రి.
అయినా తన హృదయాన్ని ఇంకిపోనీయదు.
తనువంతా ఎండిపోయి బీటలువారినా
తనలోని తడిని కాపాడుకుంటుంది.
తనకోసంకాదు తన సంతతికోసం.
ఏముందిక్కడ
చట్రాళ్లే చచ్చుబీళ్లేకదా అని చులకనచేస్తే
పదిలపరుచుకున్న పాతాళగంగల ఊటలను
దాహార్తుల దోసిళ్లలోకి పంపిస్తుంది.
బండను పగలగొట్టినప్పుడు
నీటిజల అగుపడినప్పుడు
గుండెలేని చోటేదీ అని అనిపిస్తుంది.
పరుచుకున్న నీటిచలువలే చెట్లనీడలు.
తలలు తగలబడిపోతున్నా తరువులు వర్షించేవి
ఆత్మీయతను పంచే శీతలచ్ఛాయలే.
నీలియెడారిలా దిశాంతాలదాకా వ్యాపించిన

సి. నారాయణరెడ్డి

పరమశుష్కగగనం తపించిపోతేనే మొలుస్తాయి
తడివూపిరి మొలకలు.
ఆర్ద్రచిత్తమే లేకుంటే
ఆకాశానికి అన్ని మబ్బుల పులకలెలా కలుగుతాయి?
వాన మొయిళ్ల గాలిసోకితేనే చాలు
గిరీంద్రాల నెత్తులు మెత్తబడిపోతాయి.
చినుకుల తుంపరల్లోని ఆప్యాయత ఎంతో
చిగురాకుల చెంపలనడిగితే చెబుతాయి.
మంటిపొరల్లోని మింటితెరల్లోని ఆర్ద్రత
మానవాంతరంగంలోనూ తరగలెత్తుతుంది.
ఒకోసారి ముళ్లపొదలా గుచ్చుకున్నట్టు అగుపించినా
మనిషిలోని పూలనునుపు మాసిపోదు.
ఎక్కడ కన్నీరు తొణికినా
తుడిచేయాలనే తహతహ తనవేళ్లకు.
ఏ హృదిలో చితిరగిలినా
ఆర్పేయాలనే తపన తన కన్నీటిజల్లులకు.
ఎవరో తన గుండెను చీల్చి నెత్తురు తాగేస్తుంటే
పోనీపాపం దాహం తీర్చుకోనీ అనే
సముదార సానుభూతి తనది.
భూమ్యాకాశాల లాలనలో పెరిగిన బిడ్డకదా!
ఆ క్షమాగుణం ఆ దయాగుణం ఎక్కడికిపోతాయి?

అంతటి సుగుణాలవరకే ఆగిపోయిందా
ఆ వాత్సల్యవారసత్వం?
క్షణికోన్మాదంలో మాతృధాత్రి వక్త్రం నిలువునా చీలి
కన్నబిడ్డలను కబళించినట్టు –
అవనికే కప్పుగా నిలిచిన ఉత్తాలగగనం
అమృతవృష్టికి బదులుగా
హఠాత్తుగా పిడుగులు కురిపించినట్టు –
అప్పుడప్పుడు మనిషీ వికటిస్తాడు మృగంలా.
తాను పాలుపట్టి పెంచే నైతికమూల్యాలను
స్వార్థదంష్ట్రలతో కొరికేస్తాడు.
చేసిన నేరాలను సరిదిద్దుకోలేవు
ఇటు మహీతలం అటు విహాయసం.
'అలాగే నేనూ' అని మానవుడంటే
అదనంగా ఎత్తిన ఆ జన్మ వ్యర్థం.
మానవజన్మకు సార్థక్యం సర్వజ్ఞతలో వుంది.
జ్ఞానతృష్ణకు ధూళిరేణువుకూడా
గవేషణ కేంద్రమవుతుంది.
మనుషులేకాదు పక్షులూ సంభాషిస్తాయనే
భావరేఖ మెరుస్తుంది.
పక్షుల భాష తెలుసుకోవడానికి
పరకాయప్రవేశం చేయనక్కర్లేదు.

ఆ కిలకిలలకు చెవుల్ని అంటిస్తే చాలు
చెక్కినట్టున్న రాతప్రతులు దిగొస్తాయి.
హృదయం మొద్దుబారినవాళ్లకు
కలకూజితాలు పిచ్చిరొదలే.
విత్తనాలు కూడా మాట్లాడుతాయని
చాలామందికి తెలియదు.
అవి పైకి ఎగజిమ్మిన అక్షరాలే మొక్కలు.
నిజంగా విత్తనం జన్మ ఎంత గొప్పది.
తన గర్భాశయం చీల్చుకుని
సృష్టికి మరోప్రాణాన్ని అందించి
ఎత్తినజన్మ చాలిస్తుంది.
చచ్చుబతుకు బతకడం విత్తనంవల్ల కాదు.
మనమూ వున్నాం
చేతికి మట్టి అంటగూడదు.
ఫలితాలు మాత్రం తలలూపుతూ రావాలి.
ముతకదుస్తుల చెమటవాసన కొడితే
ముక్కుమూసుకుంటాం.
మనం తినే అన్నంమూలం
ఆ చెమటకంపుదేనని మరిచిపోతాం.
పక్షుల్లాంటి అమాయకుల స్వచ్ఛస్వరాలు
ప్లాస్టిక్ చెవులకెక్కవు.

విత్తనాల్లాంటి నాటు మనుషుల త్యాగాలు
నాజూకుచూపులకు ఆనవు.
అనుకున్న ఎత్తును చేరుకుంటాం
ఎదుటివాళ్ల శవాలపైనుంచి నడిచైనా సరే.
ఎన్నెన్ని వేషాల్లో స్వార్థం ఊరేగుతుందని.
వైరాగ్య ప్రవచనాలకు కూడా ఉబలాటం
తమ వదనభంగిమలను
వీడియోల్లో చూసుకోవాలని.
ఒలికే మాటలకూ కలిపే చేతులకూ మధ్య
ఎంతెంత అగాధం!
ఏ రంగమైతేనేం?
అంతటా ముసుగులాడే ముచ్చట్లు.
అలా తిరిగితే చాలు
వీపుమీద కసుక్కున దిగే కత్తిపోట్లు.
ఛిద్రమవుతున్న మానవసంబంధాలను
చేజారుతున్న సౌజన్యమూల్యాలను
భద్రపరుచుకునే హృదయపేటికలు
ఇంకా కొన్ని మిగిలివున్నాయి.
ఆ ఊరటను ఊపిరిగా చేదుకుని
మంచితనం జీవిస్తుంది మనిషి వున్నంతకాలం.
ఏ అణువూ దేనికదే వుండాలనుకోదు.

సి. నారాయణరెడ్డి

ఏ అవయవం కలయికకు విరుద్ధంకాదు.
స్పర్శావాంఛ సమస్తసృష్టికి సహజం.
గాలి పుట్టిందే స్పర్శకోసమా అనిపిస్తుంది.
విచ్చుకునే పూలపెదవులనే కాదు
గుచ్చుకునే ముల్లకంటిమొనలను కూడా
అదిస్పర్శాభాషలో మెత్తగా పలకరిస్తుంది.
అస్పృశ్యతా జాడ్యమంటని సమస్పర్శి వాయువు.
పచ్చితోళ్లు వేలాడే మురికికంపువాడలని
దూరదూరం తొలిగిపోదు.
బొట్లుబొట్లుగా రాలేనెత్తురును స్పృశిస్తూ
చచ్చిన ప్రాణులపట్ల సానుభూతి ప్రకటిస్తుంది.
వెన్నెల పావురాళ్లను దువ్వినంత హాయిగా
ఎలుగ్గొడ్డులా కదిలే చీకటితోనూ చేయి కలుపుతుంది.
ఎక్కడా ఎవరూ గాలిని వెలివేసిన దాఖలాలు లేవు.
అది తిమ్మిరెక్కి దుమ్ములా రేగినప్పుడు మాత్రం
ప్రకృతి కాసేపు కళ్లుమూసుకుంటుంది.
నీటికి బుజ్జిబుజ్జి నడకలొస్తే చాలు
అది మట్టిని మనసారా చుట్టేయాలని ఉరకలు పెడుతుంది.
కొండ ఎదురైతే ఆగి
ఎలాగైనా దాని గుండెలోకి దూరి నిమరాలని చూస్తుంది.
కరుకు రాతినేలను తాకే నీటివేళ్లు

ఆ కాఠిన్యానికి ఏమాత్రం జడుసుకోవు
జాలిపడతాయి.
పాపల్లా పెరుగుతున్న పైర్లవెన్ను తడుతూవుంటే
ఆ జలస్పర్శలో వాత్సల్యం వర్షిస్తుంది.
ఉదయించే ప్రతికిరణం మొదట కోరుకునేది
అనిర్వచనీయ స్పర్శానుభూతినే.
అది గగనంనుంచి దిగొచ్చేది ఆ లబ్ధికోసమే.
సూర్యునికి పిచ్చి ఉబలాటం
తనచుట్టూ తిరిగే గ్రహాలను తడిమి చూడాలనీ
అవి క్షణకాలం ఆగిపోతే
కుతి తీరేటట్టు కౌగిట్లో గుచ్చెత్తివేయాలనీ.
గ్రహాలకు తెలుసు అదే జరిగితే
మరునిమిషంలో భస్మరాసులైపోతాయని.
అది గమనించిన సూర్యుడు
మృదుల కిరణాంగుళులతోనే సుదూర ప్రకృతిని స్పృశించి
సంతృప్తిని చేదుకుంటాడు.
జడజగతిని ఆడించే ఈ స్పర్శాకర్షణే
మనిషికీ సంక్రమించింది.
ఒక స్పర్శను అందించాలన్నా
ఒక స్పర్శను అందుకోవాలన్నా
మానవశరీరం సర్వం మహాద్భుతకేంద్రం.

శిరసునుంచి కాలివేళ్ల చివరలదాకా
ఏది తాకినా దేనితో తాకినా
భాషాతీత సంభాషణలు మోసులెత్తుతాయి.
మానవశరీర భాగాలన్నీ
స్పర్శాసూత్రాలకు సాంకేతిక భాష్యాలే.
అధరసంయోగంలోనో
ఆలింగనయోగంలోనో కాదు
పరస్పరాలోచనల సారూప్యంలోనూ
అగుపించని ప్రగాఢస్పర్శ వుంది.
ఎక్కడెక్కడో అచ్చయిన పుస్తకాలొచ్చి
ఇక్కడి బుర్రలోని పుటలను తడుముతూవుంటే
ఆ సంస్పర్శలోనుంచి రేకులెత్తుతుంది
అపూర్వ తత్వజిజ్ఞాస.
నన్ను ముట్టుకోకు అన్నవాడు
ఉన్నచోటనే వుండిపోతాడు.
స్పర్శలో సాంగత్యంలో వుంది సర్వాంగీణ వికాసం
దేహానికైనా ఆలోచనాప్రవాహానికైనా.

అవని సమస్తాన్ని అంగణంలోకి రప్పించిన మనిషి
అంబరం ఔన్నత్యాన్ని అరిచేతిలో దర్శించిన మనిషి

ఒక్కొక్కప్పుడు నత్తగుల్లలా ముడుచుకుపోతాడు.
గిరిశృంగంలాంటి హృదయాన్ని హ్రస్వీకరించుకుని
మరుగుజ్జులా అయిపోతాడు.
పొద్దుపొడుపును చూడగానే
తూర్పుదిక్కు పట్టనంత పరవశించిపోయే తాను -
కిటికీలోనుంచి నెలవంక పలకరించగానే
రెండుకళ్లూ ఆ తునకకే అంకితం చేసే తాను -
కొండకొసనుంచి దూకే జలధారలో
గుండెలోని శ్రుతిని సరిచూసుకునే తాను -
తోటిమనిషి అలికిడి వింటేనే
తుళ్లిపడతాడెందుకని?
కెరటాలు పరస్పరం లీనమైతేనేకదా
సముద్రం ఏర్పడేది.
జనబాహుళ్యం ఏకమైతేనే కదా
సమాజం నిలబడేది.
పక్కపక్కన వున్న చెట్లకొమ్మలు పలకరించుకుంటాయి.
నీడలు అన్యోన్యంగా కౌగిలించుకుంటాయి.
తమ ఉనికి ఉన్నంతసేపు
తాదాత్మ్యాన్ని సంపూర్ణంగా పంచుకుంటాయి.
ఎక్కడిక్కడి మట్టిలోనుంచి కొట్టుకొచ్చిన నీళ్లో
ఏటిపాయలో ఎంత బాగా ఒదిగి పారుతాయి!

అవి డప్పు కొట్టుకుంటాయా
తాము పుట్టిన మట్టి మాత్రమే గొప్పదని.
సాయంసంధ్యావేదికపైన ఎదురుపడే
ముసలియెండా పసివెన్నెలా కసురుకుంటాయా?
కాసేపు ఒకదానిమీద ఒకటి ఒరిగిపోయి
కబుర్లు చెప్పుకుంటాయి.
జడసృష్టి రంగరించుకున్న సమదృష్టిని
చైతన్యమూర్తి మానవుడు కోల్పోయాడా?
సహమానవ స్పర్శంటేనే తనలో
అసహనం బుసకొడుతున్నదా?
కొండలమధ్య వుండే అఖాతాలను
మనుషులమధ్య కోరుకుంటున్నాడా?
ఒక కొమ్మ ఏపుగా ఎదుగుతూవుంటే
మరోకొమ్మ విరిగిపోతున్నట్టా?
అన్ని కొమ్మలకూ ఆధారం స్కంధమనే
మౌలిక సత్యాన్ని మరిస్తే ఎలా?
మనసును అద్దంలో చూపడానికే కదా
మాట పుట్టింది.
మాటతో చల్లార్చే వైషమ్యాలను
మాత్సర్యంతో రగులుకొలుపుతాడేమిటి?
గాయపడ్డ పూలతీగకు

గాలి అలికిడే చల్లని ఓదార్పు.
ఏ భాషా నోచుకోని గువ్వలకు
ముకుపుటాల తాకిడే తీయని పలకరింపు.
అభిమతాలను తేటగా ప్రసరించాలంటే
ఎన్నివాహికలు లేవు?
అవతలిగట్టును తిన్నగా చేరుకోవాలంటే
ఎన్ని వంతెనలు లేవు?
సభ్యతను పాలుపోసి పెంచుకున్నది
స్వచ్ఛ మానవీయమూల్యాలను
పచ్చివిషంలో ముంచెత్తడానికా?
మహోధృతంగా తిరిగే యంత్రదేహాల ముందు
మానవముఖాలు వెగటు కలిగిస్తున్నాయా?
మనిషి బుర్ర సృష్టించిన ఆ యంత్రరూపం
మనిషినే ఏమారుస్తున్నదా?
న్యాయంనోరు కుట్టేసిన వ్యాపారసూత్రాలు
మానవతాప్రమాణాలకు కొలమానాలా?
నరాల్లో ధనంమత్తు పారలెత్తుతూవుంటే
మమత మసకబారిపోతుంది.
మైత్రీసూత్రం సడలిపోతుంది.
ఇరుకుసందుల్లో బేరాలు దిద్దుకున్న స్వార్థం
విశ్వవాణిజ్యకేంద్రాలను

తన కాళ్లముందుకు రప్పించుకుంటుంది.
తాను మీటిన టెలిఫోన్‌తీగమీద
నాలుగుదిక్కుల ఆర్థికవ్యవస్థా నర్తనమూర్తులను
నాట్యం చేయిస్తుంది.
ధనాధిక్యం ఆధిపత్యానికి దారితీస్తుంది.
ప్రాంప్టర్‌గా మొదలైన అధికారతృష్ణ
యాక్టర్‌గా మారిపోతుంది.
అన్నిపాత్రల సైజులను కత్తిరించేసి తానే
అనన్య నాయకమూర్తిగా విక్రమిస్తుంది.
ఆర్థికప్రాచుర్యాన్ని అధికారప్రాబల్యాన్ని
స్విచ్చినొక్కి ఆడిస్తుంది కీర్తిదాహం.
ఏ మధుసముద్రాలూ చాలవు
ఆ దాహాన్ని తీర్చడానికి.
ఉన్న నదీజలాలన్నీ మళ్లించినా
ఆ చెరువుచెంబు నిండదు.
నెర్రెలు పడిపోయిన ఇరుగుపొరుగు నేలలు
చారెడు నీటికోసం మొరపెట్టుకుంటున్నా
ఆ చెరువుచెవులకు వినిపించదు.
ఏ ప్రకటనలు గొంతుకలెత్తినా
తన నామమంత్రం వినిపించాలి.
మెరిసే ఏ తెరమీదైనా సరే

తనక్లోజప్ నిశ్చలంగా అగుపించాలి.
స్వార్థమలినకీర్తి మూర్తీభవిస్తే
సహజీవనానికి చావుకబురే.
మిన్నుదిగొచ్చిన ప్రభాతకిరణాలు
గుడిగోపురం మీద మెరుస్తాయి.
గుడిసెనూ పరామర్శిస్తాయి.
సత్తావున్న విత్తనమే అయితే
గరికమొలకకూ మామిడిమొక్కకూ తేడా చూడదు నేల.
బాహిరసృష్టికున్న ఐక్యదృష్టి
అంతర్వీక్షణమున్న మనిషికెందుకు లోపించాలి.
మానవసంబంధాల సమతౌల్యం దిగజారితే
సమాజం మృగసముదాయమే.
జగతిని రంగస్థలంగా మార్చుకుని
గగనాన్ని మకుటంగా మలచుకుని
అందరిలో తన బింబాన్ని చూసుకుంటూ
అందరి ఆశయాలను తనలో శ్రుతిచేసుకుంటూ
నిత్యచైతన్యంతో నిలిచే మనిషి
నిష్క్రమణలేని పాత్రధారి.
నిఖిల విశ్వంభరా పురోగతుల
నియతిని కాపాడే సూత్రధారి.